ఆస్పత్రులనిమిత్తము సుప్రసిద్ధమైన భవనము
అవసరమైనచో కనుక్కొనవలెను.



జే. ఎం. సి. మూవెనా ఢిల్ డబుల్ రెయి న్, అందు డబుల్ గాల్ వృక్షము లు, పెక ఎత్తుగట్టి చిలింపుటనుకూలమైన సామగ్రి యంత్రములు, సర్జికల్ సెట్లు చేయు మెషినులు దయచేసి వచ్చి పరిశీలింపుడు.

ప్రదర్శనగదులు, నెం 128/124 మూర్ వీధి
న్యూ మ్యాడ్రాసు మాచ్ ఫ్యాక్టరి, జి. టి. మద్రాస్.

## సిద్ధౌషధము

అజీర్ణము, అతిసారము, నిస్సత్తువ మున్నగువాటికి
మా జాతిప్రసిద్ధ ఔషధము
ఆతంకనిగ్రహ మాత్రలను సేవింపుడు
32 మాత్రలు గల డబ్బా రూ. 1
పూర్తివివరములు 150 పుటలు గల జాబితా
ఉచితముగ పంపబడును.
ఆతంకనిగ్రహ ఫార్మసీ
26, బ్రాడ్వే మదరాసు. 5

**The Asiatic Government Security Life Assurance Co. Ld.**
Bangalore.

A First Class Indian Life Office offering Maximum Benefits at minimum cost. Increase of nearly 56 per cent in business.

SPOKEN WELL
Both by Press and the Public.

*Write for Agency terms & other particulars:*
**V. RANGASAMY** Esq.,
B.A.B.L., F.C.I.,
General Secretary, Bangalore.

**Messrs. P. K. RAU & Sons.,**
Chief Agents, Madras Presidency
2, Veeraswamy Pillai St., Egmore, Madras.

# రత్నపురుష లేహ్యాం

మా చే యీ లేహ్యాం తయారు కాబడి చిరకాలమునుండి నిర్వహింపబడుచున్న సంగతి లోకవిదితము. నష్టపడినటువంటి శక్తిని బలము కలుగజేయుటకు దీనికి మించినది లేదని చెప్పవచ్చును. ఇట్టి మేలు కలది అనేకులు పొందుచున్నారు.

(శగరేహ్యాం) వెల 1 డబ్బీ ఖరీదు 3-4-0 లు
విజాతికన్న వసూల్గించుటను. డబ్బీ 1-8-0

శ్రీపట్టాభిరామ వైద్యశాల,
రాయవరము, తూర్పుగోదావరిజిల్లా.

# సహకార పంచాయతిదార్ల తరగతులు

2 వ సమావేశ కార్యక్రమము

ఈ దిగువ నిర్ణయింపబడిన కేంద్రస్థలములందు ఆయా తేదీలలో జరుపబడును.

1. రాయపేట – జనవరి 6 మొదలు 10 తేదివరకు తేది
6 అప్బాస్ ఆలీఖానుపేట, ఖమ్యూటీపరములు.
7 రంగూన్ వీధి, మౌంటురోడ్డు.
8 ఎల్లపది మూదాకొళం, మైలాపూరు.
9 ఆరపది వినాయకరుచేరి, మైలాపూరు.
10 రాష్ట్రీయ సహకారయూనియను కార్యాలయము.
(మేజిక్‌లాంతరు ఉపన్యాసము)

2. జార్జిటౌను-జనవరి 16 మొదలు 20 తేదివరకు తేది
16 కాశీమొదలు ఆదిద్రావిడచేరీ, రాయపురం.
17 సి. ఎల్. ఎస్. సహకారసంఘకార్యాలయము
18 విల్లిగ్రడ సహకారసంఘ కార్యాలయము.
19 రిప్పను భవనములు (మేజిక్ లాంతరు ఉపన్యాసము)
20 చాకలపేట, శ్రీనివాస భక్తజనసభ సహకారసంఘ కార్యాలయము.

3. మౌంటు రోడ్డు
జనవరి 21 మొదలు 25 తేదివరకు తేది.
21 కాలిమంచేరీ (మేజిక్ లాంతరు ఉపన్యాసము.)
22 పరంగడు, ఎగ్మూరు.
23 పెరియమెట్టు సహకారసంఘ కార్యాలయము.
24 చింతాద్రిపేట సహకారసంఘ కార్యాలయము.
25 మెతడిస్టు చర్చి, వెపెరి.

4. పురసవాకం
జనవరి 27 మొదలు 31 తేది వరకు
27 మైలర్సు సహకారసంఘ కార్యాలయం, మాధై.
28 వకింగహాం, కర్నాటక మిల్సు సంఘ కార్యాలయము.
29 పులియంతోపు కణేశసంఘ కార్యాలయము, పెరంబూరు.
30 వ్యాసర్పాడి సహకారసంఘ కార్యాలయము.
31 వెపెరి భారత క్రైస్తవసంఘ కార్యాలయము (మేజిక్ లాంతరు ఉపన్యాసము.)

చంద్రా నర్సరీతోటలు- సేలం జంక్షన్

8 సం॥ అంటుమామిడిచెట్లు, ఇతర ఫల అంటుచెట్లు ఒకటి రు 7½. నిమ్మ, స్వదేశి కర్పూర ఫలవిత్తులు, 24 దినములు పెట్ రు 2½, 12 దినములు 1¼. పూలు మదరాస్ పడి 8 కి రు 1. క్యాటలాగు ఉచితం.
Chandra Nursery, P. O. Salem Junction.

1930 అమృతాంజన ముడిపోవారి 1930
# అందమైన రంగుల క్యాలెండరు
ప్రసిద్ధిచెందిన చిత్రకారులచే వ్రాయబడిన
సుందరి, శ్రీ సీతారామాపులు, మహాత్మాగాంధి
త్రివర్ణచిత్రపటములు కలవు.
క్యాలెండరు 1-కి 0-2-0, 12-కి 1-4-0, 100-కి 9-12-0
ప్యాకింగు పోస్టు ఖర్చు ప్రత్యేకము.
వరా:—50 క్యాలెండర్లు అంతకుపై ఆర్డర్లకు సగము సొమ్ము అడ్వాన్సుగా పంపుము దగ్గర రైల్వేస్టేషను తెలుపవలెను.
3 క్యాలండర్లు అంతకు పైని మాత్రమే వి. పి. మూలముగా పంపబడును.
బొంబాయి — అమృతాంజన ముడిపో — మదరాసు.

సంతానం పుట్టకుండా 106-1
# 'కాంట్రాసెప్టిన్'
ఒక్కటే సులభమైన సురక్షితోపాయం
16 మాత్రలు ట్యూబు 1-12-0
ట్యూబులకు ఇతర వివరములకు:—
దిసోషల్ హైజీన్ సిండికేట్
1/3 అంపర్సన్ వీధి, బ్రాడ్వేవద్ద మద్రాసు.
ఇతర కెమిస్టులు అండ్, డ్రగ్గిస్టులవద్ద కూడ దొరకును.

ఇనాం! ఇనాం!! ఇనాం!!!
# పసిపిల్లలకు ఇన్‌ఫెన్‌టోన్
శాంపిల్ ఇనాం అందు దీనికి సంబంధించిన పుస్తకము ఇనాం

1 ఇన్‌ఫెన్‌టోనును ఆవుపాలు, బర్రెపాలు, మేకపాలు, కన్‌డెన్సుడు పాడకపాలు మొదలగు వాటితో కలిపిన తల్లిపాలవలె నగును.

2 పసిపిల్లలకు కలుగునట్టి మలబద్ధకము, అజీర్ణము, వాయువు, ఈడ్పు, జ్వరము దగ్గు మొదలగు వ్యాధులను అటంకపరచును.

3 జీర్ణశక్తియు, ప్రేగులకు సంబంధించిన వ్యాధుల నాటంకపరచుటకు పాలు తాగనట్టి బిడ్డలకు ఇన్‌ఫెన్‌టోన్ నియ్యవలెను.

4 దంతములు వచ్చునప్పుడు ఇన్‌ఫెన్‌టోన్ మిక్కిలి భద్రమైన రక్షణము.






టి. ఎమ్. షెరిఫ్ ఇస్లామియాల్లజ్,
9 వేపెరి హైరోడ్డు, మద్రాసు.
దాదా అండుకో, మద్రాసు.
ఆఫ్రికన్ షాఫ్, బెజవాడ.

**Pyorrhoea Alveolaris**
పంటిచిగుళ్లలందు చీము నెత్తురు రక్తమునకు చికిత్సను తెలుపు పుస్తకము ప్రతి 1-కి రు. 0-4-0.

**Dental Caries or Cavities**
దంతములు పుచ్చుటకు మాన్పు చికిత్స పుస్తకము, ప్రతి 1-కి రు. 0-4-0

వివరములకు ఈదిగువవిలాసమునకు వ్రాయవలెను.
డాక్టరు హెచ్. వెంకటరావు ఎల్ ఎమ్ అండ్ ఎస్.,
కొంతకాలము జనరల్ ఆస్పత్రియందు డెంటల్ సర్జనుగా – యుండినవారు, నెం. 3501 నైనాలపారు
ఫ్లవర్ బజారు పోలీసుస్టేషనుకు ఎదుట, మద్రాసు.




THE HERCULES CYCLE & MOTOR CO LTD

దూని యేరకం వుద్యోగస్థుడో అని శంకాకుప్పట్టింది నాకు. ఆడావిడిగా ఎవరినీ పలకరించకుండా హోటలాయినదగ్గరకు వెళ్లి తనిఖీచేశాడు. దొడ్డోకి వెళ్లాడు. చేతులు కడుక్కో కుండు, నీళ్లతొట్టిచూశాడు. యివన్నీ ఎల్లావుండాలో అలాగేవున్నాయి. ఒక బల్లమీదకూర్చుని "కాఫీహోటలు అంతా చాలాపాడుగావుంది, నీ మీద ప్రాజిక్యూషనులాంటి చేస్తా" నన్నారు శెంటిలుమేనుగారు. యీ దబాయింపుతోటి రకరకముల ఫలహారములతో నిండిపోయింది శెంటిలుమేనుగారి ముందువున్న బల్ల. వేడియిడ్లీ, సాంబారు చూసేసరికి శెంటిలుమేనుగారికి వేడి తగ్గిపోయింది. ప్రాజిక్యూషను మాట మరచిపోయి పెసరట్లుపని పట్టినారు. వేడి కాఫీ కడుపులో పోశారు. కాఫీ యిచ్చేకి అసలు వేడి పూర్తిగా అణిపోయింది. టెంపరేచరునార్మల్ లోకి వచ్చింది. దీనితో శెంటిలుమేనుగారికి బిల్లుకుదిరి పత్యంపెట్టిన అయ్యరు వార్నింగు యిచ్చి అయ్యరు నవ్వుతో సెలవుపుచ్చుకొన్నారు. యీ ఆడావిడి నిబట్టి శెంటిలుమేనుగారు హెల్తుడిపార్టుమెంటు వుద్యోగస్థుడు అనుకున్నాను. అయ్యరుగారికి ఆకలివేసింది గాబోలును అయ్యరుమీద ఆడావిడి చేశారు. యింతకన్నా మరేమీ లేదనుకున్నాను.

6. కాఫీకోరుకుతుంది అనుకున్నాను అసలు ఆడావిడి తగ్గిందికాబట్టి. యింతలోకి హిందుస్థానీ పూప్రకుంటూ కలకత్తాస్లిప్పర్సు తొడుక్కొని లోపలికివచ్చారు ఒక పంతులుగారు. పంతులుగార్ని చూసేసరికి వాళపెసితే ఏలాగున అదరిపడితాడో అలాగున అదరిపడి కుర్చీలోనుంచి పాలిమేర కేకల వలె పెద్దపెద్ద కేకలతోటి అరవములో చెప్పాడు కాఫీ హోటలు అయ్యరు నౌకర్లతోటి. దానితో ఫలహారముల పళ్లెములు వచ్చి పడ్డాయి పంతులుగారి బల్లమీద. యిదంతాచూసి యీయన ఏలష్టాధికారో అయియుంటాడు లేకపోతే మంచి పలుకుబడి వున్నవాడు అయివుంటాడు లేకపోతే ఏగొప్పవిధికారో అయివుంటాడు. కాకపోతే అడగకుండా ఇన్నివస్తువులు వచ్చి బల్లమీద పడతాయా అనుకున్నాను. అయితే చాలా గర్వాంగా వుంది అనుకున్నాను యీయన వ్యాపారము. యీమాత్రంలేకపోతే ప్రపంచకంలో బ్రతికి ఎందుకనుకున్నాను. ఫలహారములన్నియు కావలసినే తిన్నారో, లేక కాఫీహోటలు అయ్యరు తనదర్జాకని పెట్టి తాను అడుగకుండా అన్ని వరకులు తెప్పించి బల్లమీద పెట్టించినప్పుడు వద్దంటే తనకు పరువు హీనమో, మర్యాదనష్టమో అనే వూహకున్నారోగాని కడుపులోనికెక్కించారు ఫలహారములనన్నింటిని పంతులుగారు బలవంతముగా. రు 1-4-0 లు బిల్లు తేలింది చివరకు. అయ్యరుకు మాట్లాడకుండా సాష్టాంగనమస్కారంయిచ్చి దయచేశారు పంతులుగారు. యీయన ఎవరాఅని విచారిస్తే క్రొత్తగా బి. ఏ. బి. యల్. ప్యాసయి బల్లకట్టుకొని రోజుకు బండి అద్దెఅయినా గిట్టకపోతే సాయంత్రము గాలిషికారుగా యింటికి నడిచివచ్చే క్రొత్తప్లీడరుగారు.

7. జనరద్దీ తగ్గుటలేదు. నాకు కాఫీకోరికే దారిలేదు. అందరిమొత్తముగా కేకలువేసి నేను అడగలేను. శ్రద్ధామనుకుంటున్నాను. యింతట్లోకి ఎర్రగా పొడుగుగావున్నాడు. 40 సం॥లు వయస్సు వుంటుంది. దమానుతోకలాగున మీసాలువున్నాయి. గ్లాసుకోపంచె వారగోచిపెట్టికట్టాడు. తెల్లకోటుతొడిగాడు. ఆసలు బుట్టమారుక్కొగొడుగు చేతిలోవుంది. వుప్పాడ మామిడంచుల కండువా కుచ్చు తలపాగాచుట్టాడు. కిర్రుచెప్పులు తొడిగాడు. వచ్చాడు. నాప్రక్కన బల్లమీదకూర్చున్నాడు. దేహమునుబట్టి దర్జాగా పెడిపందులావున్నాడు. కాని పాపము పైకిరిబట్టి కుష్ఠురోగము ప్రారంభదశయందున్నట్లు తెలుస్తోంది. ఏమండో! హాల్లుయిడ్లేన్సు (యిడ్లేన్లు) తెప్పించండి అన్నాడు మనపెద్దమనిషి. చిత్తంఅని తెప్పించాడు కాఫీహోటలు అధికారి. దేవపుపొంగ (వుఘవా) పంపించండి అన్నాడు. పంపించాడు అధికారి. కాఫీకావాలి అన్నాడు. కాఫీ వచ్చింది. యీయన సంభాషణకు అంతావన్యాము. యీయన ఎవరో, ఏవూరో, ఏవుద్యోగమో కనుక్కుందామని ప్రస్తావనలోకి మెల్లిగా దింపాను.

నేను—అయ్యా! తమ దేయూరు.?
పెద్దమనిషి:—మాదికోనసీమలో ఒక పల్లెటూరు.
నే—తమ రెవ్వరు.?
పె॥ మ॥ మేము నాయుళ్లము.
నే॥—అంటే కాపులా, తెలగాలా?
పె॥ మ॥—కాదు. బలిజీలము.
నే॥ చిత్తం. నామధేయం?
పె॥ మ॥—ఎ. వి. రావు.
నే॥—ఏపనిమీద దయచేశారు యీవూరు?
పె॥ మ:—కొంత బిజినీసువుండి వచ్చాను.

అయ్యా! యిక మాట్లాడలేక పోయాను. కడుపుబ్బిపోయింది. నవ్వలేకుండా వున్నాను. నవ్వితే ఏమనుకుంటాడో పెద్దమనిషి. సెలవు పుచ్చుకుంటానన్నాను. సరే అన్నారు ఆ బలిజనాయుడు గారు.



8. కాఫీహోటలు ఆడావిడి కొంచెంతగ్గింది. నన్ను కొంచెం కనిపెట్టాడు. యజ్ఞోపవీతం మెళ్లో లేనివాడు. కాఫీత్రాగ కూడదనుకొన్నాను. అయినా యింత నేనుకూర్చుని కాఫీత్రాగకుండా వెళితే బాగుండదని కాఫీ పట్టుకువచ్చి యిచ్చాడు. యిక్కడో చిన్న పొరపాటు జరిగింది. నాతో మాట్లాడిన కుష్టురోగపువాడు త్రాగిన కప్పులను తోముటకు కాబోలు పట్టుకు వెళుతున్నాడు క్లీనరు. యింతట్లోకి అయ్యరు కేక వేసాడు క్లీనరుకు. ఆకేకతోటి పొడలి క్లీనరు కప్పులను ప్రకనున్న బల్ల మీదపెట్టాడు. యింతట్లోకి నాకు కాఫీతెచ్చుటకు వెళ్లాడు మన పిడ్డి సప్లైరు. తోమివననుకుని కప్పులతోటే నాకు కాఫీయిచ్చాడు. యిదంతా నేను చూశాను. నాకు విరక్తంపుట్టింది కాఫీ చూసేసరికి. కాఫీగ్లాసులు అక్కడ వదలివేసి అయ్యరుకు డబ్బులు సమర్పించి మెల్లిగా యింటికి చేరినాను.

అయ్యా! పాఠకులకు నాదొక చిన్న మనవి. మన భారత సోదర సోదరీమణులందరున్నూ యీ పాశ్చాత్యపద్ధతులకు అలవాటుపడి ప్రాచీనపద్ధతులు విసర్జించి శరీరమునకు అసౌఖ్యము కలుగజేయు యీ కాఫీ, టీ, కోకో పానీయముల స్వీకరించుటచే మితిలేని రోగముల పాల్పడి ప్రాణములు గోల్పోవుచున్నారు. కాఫీహోటళ్లవలన మనమిన్ని రోగములకు పాల్పడుచున్నాము. అట్లగుటం జేసి మన హిందూ దేశమందు ప్రతి పట్టణమందును, ప్రతి గ్రామమందును ప్రతి పల్లెటూరునందును యింటికొక వైద్యశాల బయలుదేరినది. యింటికి వసేను లెక్కకు రోగులకన్న వైద్యులు యెక్కువయున్నారు. యిదివరలో మన పూర్వులు యెప్పుడైనను వారివారి ప్రాచీన పద్ధతుల ప్రకారము ప్రవర్తించినప్పుడు రోగములు యెరుగుదురా. మందుపుచ్చుకొని యెరుగుదురా. మన హిందూ దేశములో శ్రీ గవర్నమెంటువారు స్థాపించిన వైద్యశాలలు తప్ప మరియే యితర ప్రైవేటు డాక్టర్లు బల్లలయిన అగుపించినవా. యిప్పుడో మన అనాచారముల బట్టిన్నీ యీ కాఫీహోటలు అంటువ్యాధుల బట్టిన్నీ రకరకముల రోగములు బయలుదేరుచున్నవి. రోగములనుబట్టి రకరకముల వైద్యులు బయలుదేరినారు. కాఫీహోటలు అనగా కల్లు పాకవంటిది. కల్లు అయినింటి గవళ్ల మనిషిచేత అమ్మబడును. గాని కాఫీహోటలులో నానా సంకరజాతులు వుండును. కాఫీహోటలులో జరుగు అనాచారములు యీప్రపంచకములో ఎక్కడనూ జరుగవు. కాఫీహోటలులో మంచినీరు త్రాగిన వుట్టుగతులుండవు. అవి ఏతక్కువజాతి స్త్రీయో పట్టుకువచ్చిపోయును. అదియైనను మంచినీరుకాదు. అనీరు చప్పగానైనను వుప్పగానైనను వుండును. అకాపకు నీరుకూడా హోటలులో లేనప్పుడు కప్పులు తోమిననీళ్లు లేరిన బాగుండునని మంచినీళ్ల కళాయిలో పోయుదురు. అదియేమనను ఫ్రెష్‌వాటరు అని అడిగినప్పుడు యిచ్చుమంచినీరు. అటువంటినీరు త్రాగినప్పుడు రోగములకేమి కొదువ, వైద్యులకేమికొదవ? కాఫీహోటలులో తయారుకాబడు ఫలహారములపిండి ఏపిండియో తెలియదు. ఈఫలహారములు తయారుచేయువారు మనకోమటి సుబ్బయ్య దయచేత తయారుకాబడిన బ్రాహ్మణ శ్రేష్ఠులు. అట్లుతయారుకాబడిన ఫలహారములు అతినిష్ఠపరులై, పింజలుదీర్చి కట్టి విళ్లగోచీలు పెట్టుకుండవారలు, విభూతి పెండెకట్లు ధరించిన బ్రాహ్మణ శ్రేష్ఠులు తినుటయున్నూ, ఏకుష్ఠురోగపు వాడైనను, ఏనీచుడైనను, ఏకులమువాడైనను త్రాగినకప్పులతోటి అందరూ త్రాగుటయున్నూ, కాఫీహోటలు అనాచారములు గమనించకపోవుటయున్నూ, కాఫీహోటలు అపరిశుభ్రతనుగురించి హెల్తుడిపార్టుమెంటువారుకూడ శ్రద్ధవహించక పోవుటయున్నూ, తినుటకు తిండిలేక, కట్టుటకు గుడ్డలేక, నివసించుటకు గృహములేక యింటివద్ద భార్యాపుత్రాదులు అన్నమోరామచంద్రాయని ఏడ్చుచుండ కాఫీహోటలునకువచ్చి దర్జాలుపోవుటయు, రక్కాడిన దొక్కాడుకు అనుసాపెట్రకారము వున్న ఖల్కొ, పం పెద్దబిడ్డవారున్నూ కూలివారున్నూ కాఫీహోటళ్లకు వచ్చి డబ్బు లక్ష్యములేనివారివలె ప్రవర్తించుటయు, ఏనాడున్నూ కాఫీ ఎరుగని పల్లెటూరునివాసులు కాఫీహోటళ్లకువచ్చి నిరక్షరకుక్షులై వప్పటికీ చదువుకున్నవారివలె నటించి మాట్లాడలేక తెల్లబోతున్నూ, తాముజన్మించిన కులమును దాచి వేరొకకుల నామమునుధరించుట గౌరవమని ఎంచుకులభ్రష్టులున్నూ, తల్లిదండ్రులు యింటివద్ద అష్టకష్టముల పాల్పడి సుఖజీవనమునకు సరిపోవు స్తిరాస్తుల విక్రయించి చదువుకొనుటకు డబ్బుపంపుచుండ విద్యార్థులు లేనిపోని దర్జాలు తెచ్చుకుని తూడనున్నవారికి ఫలహారముల పెట్టించి పద్దువ్రాసి పకీర్లు అవుటయున్నూ కొంచెము ప్రొద్దెక్కి మంచమునుండిలేచి కాఫీకి అలవాటైనవని ఆడావిడిగా కాలకృత్యములైనను తీర్చుకొనక కాఫీహోటళ్లకువచ్చి అయ్యరు నాశ్రయించి పళ్లుతోముపుల్ల సంపాదించి మొగము తొందరగా తోముకొని కాఫీపుచ్చుకొను దురభ్యాసమున్నూ, కాఫీకండ్లబడనివాడు కలరాబాధ్యమును కలిగినవారివలెకంగారు పడువారలున్నూ కాఫీ, టీలను కన్న తల్లిదండ్రులకన్న ఎక్కువగా ప్రేమించుచున్న నవీననాగరిక యువకుల చూచినను చాలావిచారము గలుగుచున్నది. యీమహాదౌర్భాగ్యము ఏనాడు మనహిందూదేశమునుండి తొలగిపోవునో, నా భారతసోదర సోదరీమణులందరున్నూ బాగుపడెదరో, ఏనాడు యీకాఫీహోటలు అంటువ్యాధులు బారిపోవునో, ఏనాడు భారతీయులందరు కాఫీహోటళ్లన్న విరక్తిచెంది ప్రాచీనపద్ధతులకు అలవడెదరో, ఏనాడు హిందూసోదరులందరూ తమతమవర్ణాశ్రమ ధర్మముల ప్రకారము ప్రవర్తించెదరో, నాడు మనదేశస్థులు ఆరోగ్యవంతులై దీర్ఘాయుర్దాయము కలిగి యుండుటయు, నిర్విరోధనముగా సౌమ్య వమ్మచేయుటకు మాని దారిద్ర్య దేవతను దూరమున నంపగలుగుటయు, మనపెద్దల ననుసరించి సన్మార్గములనుబట్టి ఐహికాముష్మిక సుఖములు బడయుటయు తటస్థించును. అనాడే లెక్కకుమించి పూరూరను పెచ్చుపెరుగుచున్న ఎలోపతి వైద్యులు, హోమియోపతి వైద్యులు, యునాని వైద్యులు, నేత్రవైద్యులు, దంతవైద్యులు, రణవైద్యులు, శస్త్రవైద్యులు, సంకరవైద్యులు, వెండలుకువారు, తగ్గి మనసోదర సోదరీమణులు, బాలబాలికలు సంపూర్ణాయుర్దాయము కలిగి వర్ధిల్లుదురు. నాడే మనదేశమాత తనబిడ్డలకు యీకాఫీత్రాగుడు లోనగు అంటువ్యాధులు వదలినవని సంతసించి తనకుదాస్యమెన్నటికైన పోయి స్వాతంత్ర్యము లభించునని నడియాశతోనుండును. కావునసో సోదరీమణులారా! పాశ్చాత్య పానీయములు మనదేశస్థులకు ఎంతమాత్రము లాభకరములు కాకపోవుటయేగాక మనదేహములకు కడు నీడాకరములని గమనించి ఈదౌర్భాగ్యపు అలవాటులను పోద్రోల యత్నింతురుగాక.!

(దేశహితైషి)

కనబడుటలేదు

2-1-30 తారీఖున సాయంత్రం 8 ఘంటలు వేళ్ల మా కాలాగా పందిటి వెంకయ్య కొమార్లు 1. 18 సంవత్సరముల వయస్సుగల వెంకటేశ్వర్లు యర్రటివాడు, కోల మొఖము బక్కపలచటివాడు, గ్రాంకుతుల చెవులకు 1 రాయిగల కాడ పోగులు, నల్లచెడ్డి తెల్ల చొక్కాయి తొడుకొనివున్నవాడున్నూ. యాతనితమ్ముడు రంగనాయకులు 11 వయస్సు యర్రటివాడు, పొడితల, గుండ్రని మొఖము, చెవులకు రాయిపోగులు చేతులకు 6 వ్రేళ్లుగల చిన్నవాడున్నూ, నల్లచెడ్డి తెల్ల చొక్కాయి గల యిద్దరు కలసి యెక్కడికి వెళ్లినది తెలియనందున బంధువు యిండ్లకువెళ్లి కనుక్కొగా రాలేదని చెప్పినందున జాడతెలిసినవారు మాకు వర్తమానము చేయించగలందులకు ప్రార్థిస్తు యున్నాము.

శ్యామలదాసు
అగ్రహారం, గుంటూరు.

# శక్తిప్రభావము

(వాస్వానీగారి వ్యాసమున కనువాదము)

భారతయువ సంఘములకు సంబంధించిన కార్యక్రమములలో మహాపురుషుల జీవితచరిత్రము లవశ్యపఠనీయముల నిర్బంధ పెట్టుటకుట శుభావహము. మహాపురుషు లనగా తపస్సంపన్నులు, మునీశ్వరులు, కర్మవీరులని యెఱుంగవలయు. 'శక్తి' అనపదియే యువతీయువకుల దివ్యతారక మహామంత్రము, కావుననే యౌవనులు చైతన్యము దక్కి, ప్రమత్తులై స్తబ్ధమూని, ఉత్సాహభావముతో నుండక శక్త్యుత్సాహప్రపూరితులై సత్కార్యములందు సంలగ్నులగుచు, అప్రమత్తులై శక్తిసంపన్నులై యుండవలయు. యౌవనులు శక్తి పాఠకులయొక్కయు, కర్మయోగులయొక్కయు, మహావీరులయొక్కయు సచ్చరిత్రముల పఠించి తీరవలయు. ఆత్మనిజేతలగు వారి ప్రతిబింబము లేకదా యాచరిత్రములు, సమగ్రమగు జ్ఞానసంపద, ధర్మాధర్మ వివేచనాశక్తి, భావోద్రేకము మున్నగు సుగుణసంపత్తి యున్నను మనమింకను నిద్రావస్థలోనుండి మేల్కొనకుండుటకు ప్రబల కారణము ఆత్మవిగ్రహము, ఇచ్ఛాశక్తి కొరవడుటయే. ప్రాచీనులగు శ్రీరాముడు శ్రీ శివాజీ, రాణా ప్రతాపసింహుడు, గురు గోవిందసింగ్ ప్రభృతులును, ఇటీవలివారగు నెపోలియన్ లెనిన్ మున్నగు మహాశయులెందరో శక్తిసందేశముల నొంది వానిని శిరసావహించియే యుండిరి. వారు తమతమ యోజనలందు కష్టసహిష్ణుత్వము, మనోనిగ్రహము నలవరచుకొని కృతార్థులై సార్థకజన్ము లయిరి. మహాసభలలో మనము కాగితములపై చేయుచున్న తీర్మానములు, వ్యర్థప్రసంగములు నా క్షణికసంతోష మొదవించుచుండును. మనకు ముఖ్యముగా కావలసినది నిగ్రహబుద్ధి, దృఢవ్రతము, జయకాంక్షయే గాని అర్థరాహిత్యములను, ఫలశూన్యములును, క్రియావిహీనములను కరతాళములు, హర్షధ్వనులు, వాగాడంబర ప్రదర్శనములు ఎంతమాత్రము కానేరవు. వ్యర్థప్రసంగములవలనను, పట్టిబూటకపు మాటలవలనను శక్తిని సముపార్జింపలేము, కార్యము సిద్ధింపనేరదు. మనోత్పన్నములగు భావపరంపరలు నిర్మాణమార్గము నిర్మాణాకృతి దాల్చినపుడే ఫలయోగ్యములును, లాభప్రదములును కాగలవు. శక్తి అన కార్యనిర్వహణము నిర్మాణమార్గానుసరణమే. భావపరంపరల నన్నిటిని కేంద్రీకరించి క్రియారూపమున నుంచవలయు.

## మహావీరులు

యువతీయువకులు ముఖ్యముగ పఠింపదగిన జీవితచరిత్రలలో మహాపురుషులును, సిద్ధప్రజ్ఞులును, శక్తియుతులునగు 'గారిబాల్డి' 'జోస్ రిజాల్' అనువారి చరిత్రము లత్యంతపఠనార్హములు. గారిబాల్డి అనేక కష్టపరంపరల నెదుర్కొనవలసివచ్చెను. కాని అతడెన్నడును ధైర్యమును స్థైర్యమును విడువలేదు. అతడు శక్తిస్వరూపుడు. శక్తియొక్క అవతారము. "ఎందరు నాదరికేరుటకును, నావెంటవచ్చుటకును సాహసింపకుండిన శత్రువర్గమునుండి రోమ్ నగరమును సంరక్షించుటకై మిత్రము తుదకు కునకముల నైన బురికొల్పెదనుమీ" యని చాటి బలికెనట! రోమ్ నగరము పై బాలనికిం గల దృఢవిశ్వాసానురాగములును, తాల్మియు, ధీశక్తియు, ఆత్మబలము మొదలగు సద్గుణసంపత్తియే నిరాధారులును నిరాయుధులును, యుద్ధవిద్యాపై పూజ్యమణుమాత్రమైన నెఱుంగనట్టియు ఈయిటాలియనులను సాయుధులను సుశిక్షితులను, భయంకరులును, సహస్రానసహస్రమైన యోధాగ్రేసరులు నగు శత్రుసైనికుల వారినుండి ప్రాకారరాహిత్యమైనట్టి యారోమ్‌నగరము సంరక్షింప ప్రోత్సహింపగల్గెను. దృఢవ్రతమునందే నిర్మాణకార్యకలాపము, కార్యసాధనసంపత్తి అంతర్గర్భితములై యున్నవి. దృఢవ్రతము బూనుటవలననే నిగ్రహశక్తి యలవడును. కావుననే రోమనులు తుదకు తమ నగరమును సంరక్షించుకొనగల్గి విదేశీయులనున్నవలను హర్షమునకు పాత్రులైరి. కాని కొంతకాలమునకు రోమనులలో పాపవర్తనము హెచ్చుచొచ్చెను, వారి కుల సిద్ధాంతములను మద్యపానము మాదకద్రవ్యసేవనమునందు దాసక్తులైరి, తుదకు వారే స్వాతంత్ర్యరహితపరాజయమును ప్రకటించుచేయుతోసహా ఇకలించుకొనిరి శత్రువులగు ఆస్ట్రియనులు సముద్రతరంగములవలె పుంఖానుపుంఖములుగా బయలుదేరి గారిబాల్డిపై బడబోవ్చిరి. అతడప్పటికిని చలింపక పోరాడనుంకించెను. కాని అపారమగు నా శత్రుసైన్యములతో ప్రతిఘటించుటకు సాధ్యముగాకుండెను. అంతట నాతడు చేయునదిలేక మృత్యుముఖమున నున్న అర్ధాంగిని వెంట నిడుకొని పాఱిపోవలసివచ్చెను. అప్పటికిని అతడు విశ్వాసము కోల్పోవలేదు. అగ్నితప్తమగు సువర్ణముపగిది కష్టము లధికమైనకొలది నాతనిమనోబలము మఱింత యధికమగుచువచ్చెను. తుదకు ఇటలీయే విజయముందితీరవలను దృఢనమ్మకము విశ్వాసము అతని హృదయపేతముగ బాగుగా నధిష్ఠించియుండెను. గృహక్రమముల ఆత్మాఘ్నువులకు జయలక్ష్మి తనను సాక్షాత్కరించుచుండును. నాతివృతియ నీములందు ఆశాలత పల్లవించుచుండును. కావుననే నా రేమాత్రము కార్యవిముఖులు కానేరరు. తుదకు గారిబాల్డి దృఢసంకల్పమే జయలక్ష్మిని చేపట్టెను. అతనిమనోభీష్టము సిద్ధించెను. అతడు పరలోకగతుడగుటకు పూర్వమే ఇటలీలో నవోదయమై ఏకమత్యము పెంపొందెను.

## "జోస్‌రిజాల్"

జోస్‌రిజాల్ ఖ్యాతి హైందవయువకుల కంతగా తెలియకున్నది. ఆయన ఫిలిప్పైన్ ద్వీపవాసులకు మహానాయకుడు పరమపూజ్యుండు. "ది హీరో ఆఫ్ ది ఫిలిప్పైన్స్" అను గ్రంథరాజమున నా మహనీయుని పూతచారిత్రము పొందుపరపబడి యున్నది. అతడు మహదైశ్వర్యసంపన్నుడు. పండితోత్తముడు. గొప్పనవలారచయిత. కవీంద్రుడు. ఇట్టి మహావ్యక్తియగుటయేగాక యీతనియొద్ద అమూల్యమైన దేశసేవాపరత్వ మను సద్గుణరత్నమొకటి యుండెను. అతడు జనసామాన్యమునందు విద్య బాగుగా వ్యాప్తమగునట్లుచేసి విదేశీయులగు స్పానిష్‌వారి పరిపాలనాభారమునుండి దేశీయుల విముక్తులగ జేయవలయుననియే యాతని దృఢసంకల్పము. ఇతడు 1861 సంవత్సరమున జననమొందెను. చిననాటనుండియు జ్ఞానార్జనమందధికాసక్తి కలిగియుండెను. స్పానిష్ విద్యాలయములలో ప్రసిద్ధమగు విద్యనభ్యసించెను. విద్యాలయాధికారులీతని దేశీయుడగుటచే హీనజాతివానిగా జూచుచువచ్చిరి. ఇందు మంచితెలివితేటలు చాకచక్యములు కలవాడు. కావున, విద్యాలయాధికారులు మాపు పక్షపాతమును సహింపజాలకుండెను. తర్వాత, స్పానిష్‌వారి నిరంకుశపరిపాలనావిధానము మఱింతద్వేషమును, అసూయను కలిగించుచువచ్చెను. ఆ కారణమున ప్రజాసేవ చేయుటకు బద్ధకంకణుడయ్యెను. విద్య సర్వజనప్రాప్తమైనగాని వివేకోదయమగుటయు, ప్రజలు గాఢనిద్రనుండి లేచి స్వేచ్ఛానురక్తికలవారగుట సంభవించనేరదని అతడు బాగుగా గ్రహించెను. అతడు యూరప్ ఖండమునకేగి మాడ్రిడ్, పారిస్, బెర్లిన్ మొదలగు విశ్వవిద్యాలయములలో బాగుగా విద్యనభ్యసించి తరువాత యూరప్ఖండమందంతట పర్యటనమొనర్చి గొప్పగొప్ప శాస్త్రజ్ఞులతో, పండితోత్తములతో సఖ్యమేర్పఱచుకొని ప్రస్తుత రాజకీయముల సమగ్రముగ గ్రహించి స్వదేశము నకుంజనెను. అతడెంతధనమైనను సంపాదించుటకును, రాజభోగముల ననుభవించుటకును చాలియుండెను. కాని అతడట్లు చేయక మహాతపస్వివలె ఏకునవ్రతుడై, నిరాడంబరుడై, నిఱుపేదవలె కాలముగడపుచు దేశీయమహాజన హితపరతంత్రుడై యుండెను. అతడొక నవలారాజము నరచించి ప్రకటించెను. అద్దానిలో స్పానిష్ ప్రభుత్వోద్యోగుల నిరంకుశత్వములును, మతగురువుల కపటోపాయములు, వారివలన ఫిలిప్పైనులు పడుచున్న నిర్బంధములను, అగచాట్లను స్పష్టముగా ఖండించియుండెను. ఆకారణమున ప్రభుత్వమువా రతనిని రాజద్రోహిగ, దేశకంటకునిగా జూడసాగిరి. నిజమునకాతడట్టివాడు కానేరడు. అతడు సత్పురుషశిఖామణియే కాని దేశద్రోహి, రాజద్రోహి కాడు. అతనికుటుంబములోనివారి నందరిని ప్రవాసమందుంచిరి. పాపమతడు తుదకు దేశమును విడచిపోవలసివచ్చెను. స్వదేశమును వదలుటతోడనే ప్రభుత్వమువా రతనిని నిర్బంధించి కొంతవిచారణ తంతుసాగించి దోషియని నిర్ణయించి తుపాకిచే కాల్చిచంపిరి. ఇది 1896వ సంవత్సరమున జరిగియుండెను. పర్వంకల్పము దేశమంతట వ్యాపించి ప్రజలలో తీవ్రమగు సంచలనము కలిగించెను. కొంతకాలమునకే స్పానిష్‌పరిపాలనము సమూలముగా వినాశమయ్యెను. ప్రాదకునా డేటేట దేశమందంతట ప్రార్థనలు జాతీయ యుత్సవములు జరుపుచుందురు. కరుణాప్రాయమునకే దేశమునకై ప్రాణముల త్యజించిన యీ దేశోద్ధారకుని మహాశయుని అవతారపురుషునిగా భావించి ప్రజలు పూజలొనర్తురు. ఆమహనీయుని దృఢసంకల్పమే వీరి స్వాతంత్ర్య సంపాదనమునకు సద్గతికి హేతుభూతమయ్యెను. మనుష్యుడు తొదలుచునట్టుల నెన్నటికిని దుర్బలుడును, అల్పుడును, క్షుద్రుడును కానేరడు. మనవాడు చైతన్యస్వరూపుడు. నిర్మాణకర్త.

సింగంపల్లి వేంకటాద్రి

# దేశీయవార్తలు

## రౌండుటేబిల్ సమావేశము

### 1930 సంవత్సరమున సాధ్యమైనంత త్వరలో చేయవలెను

రాజప్రతినిధికి ఐరోపీయ సంఘమువారి తంతివార్త

కలకత్తా, జనవరి 7:— సైమన్ కమిషను నివేదిక ప్రచురింపబడిన తరువాత 1930 సంవత్సరమున సాధ్యమైనంత త్వరలో లండన్ రౌండుటేబిల్ సమావేశము జరుపవలెననియు, ఈ సందిగ్ధసమయమున భారతదేశ శ్రేయోభివృద్ధికై సరసముగా ప్రయత్నించుచున్నవారందరితోను సహకారముగా వీలుపడలను పద్ధతినిమరల ప్రభుత్వమువారు స్థిరపరచుట వాంఛనీయమనియు, ఐరోపీయుల సంఘమువారు రాజప్రతినిధికిని, భారతకార్యదర్శికిని తంతివార్తల నంపినారు. (ఫ్రీ ప్రెస్.)

## బెంగాల్ రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘము

### ఉపాధ్యక్షుని రాజీనామా

కలకత్తా, జనవరి 7:— మహాత్ముని నాయకత్వమున కాంగ్రెస్వారామోదించిన కార్యక్రమమునకు తన యసమ్మతి తెలియబరుచుచు బెంగాల్ రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘోపాధ్యక్షుడగు యస్. సి. మైత్రా యమ్. యల్. ఏ. గారు తన ఉపాధ్యక్షపదవికి రాజీనామా నిచ్చిరి. విద్యార్థులను, న్యాయవాదులను యిప్పుడు పాఠశాలలను, కోర్టులను బహిష్కరించి రమ్మనుట పొరబాటని వారి యభిప్రాయము. శాసనసభా బహిష్కారమ్ముగూడ హానికరమని వారి యభిప్రాయము. వారు భారతశాసన సభ్యత్వమునకు రాజీనామా నిచ్చినను మరల ఎన్నికకు నిలువవలసియుండునని వారు చెప్పిరి. (ఫ్రీ ప్రెస్.)

## కాంగ్రెస్ తీర్మానములు

### జస్టిస్పార్టీ నాయకుని యభిప్రాయము

### కాంగ్రెస్ తీర్మానములు అనాచరణీయములు మాత్రమేగాక అపకారణము గూడ నగుచున్నవి

చిత్తూరుజిల్లాలో కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గములో నుండి ప్రస్తుతము జస్టిస్పార్టీ నాయకుడుగా నున్న శ్రీయుత బి. మునుస్వామినాయడుగారు లాహోరు కాంగ్రెస్ తీర్మానములయెడ వసమ్మతి జూపుచు తమ కాంగ్రెస్ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరి.

కాంగ్రెస్ తీర్మానములను గూర్చి తమ యభిప్రాయము తెలియజేయుచు కాంగ్రెస్ తీర్మానములు అనాచరణీయములు మాత్రమే గాక అపకారములుగూడ నని వారు సెలవిచ్చిరి. ప్రస్తుతకాలమునకు గూడ నవి అనుకూలముగా లేవు. రాజప్రతినిధితో ముచ్చటించునప్పుడు గాంధిమహాత్ముడొసంగిన హామీల నిచ్చునరకు కాంగ్రెస్ మహాసభవారు రౌంటుటేబిల్లో పాల్గొనకుండిన బాగుండెడిది. ఇప్పుడు కాంగ్రెస్వారామోదించిన తీర్మానములవలన కాంగ్రెస్వారు రౌండుటేబిల్ సమావేశములో పాల్గొను అవకాశము లేకపోయెను.

### ఇతరపార్టీ లన్నియు నేకముగావలెను

సంపూర్ణ స్వాతంత్ర్యము నామోదింపని యితరపార్టీ లన్నియు నేకమై రౌండుటేబిల్ సభ సమావేశమగునప్పుడు దానికి వెళ్లి తక్షణము భారతదేశములో అధినివేశ ప్రతిపత్తిని స్థాపింపవలెనని అభిప్రాయభేదము లేకుండ కోరవలెను. ఈమధ్య భారతసహాయకార్యదర్శి యిటీవల తెలియబరచిన యభిప్రాయములు ఆశ కలిగించుచున్నవి. వారు చెప్పిన మాటలు లేబరు పార్టీయొక్క అభిప్రాయములేయైనచో, కాంగ్రెస్వారలు గాని వారుకూడ రౌండుటేబిల్ సమావేశములో పాల్గొనుటకు దలపెట్టవచ్చు. ఈ విషయములో స్పష్టముచేయబడునని తాము సింపుచున్నామని వారనిరి. (హిందూ)

## భారత సహాయకార్యదర్శి ప్రలాపములు

### భారతీయుల యాగ్రహదుఃఖమయాభిప్రాయములు

బొంబాయి, జనవరి 6:— భారత సహాయకార్యదర్శి యగు ఎరల్ రసల్గారు రిటీవలనొసంగిన యభిప్రాయముల విషయమై చెప్పుచు సర్ చిమ్మన్లాల్ సతిల్వాదుగారిట్లు చెప్పిరి:— చాలకాలమువరకు భారతదేశమునకు అధినివేశ ప్రతిపత్తి యొసంగుటకు వీలులేదని రసల్ ప్రభువు చెప్పినమాటలకు నాకు ఆశ్చర్యము కలిగినది. ప్రస్తుతకాలమున సంపూర్ణమగు అధినివేశ ప్రతిపత్తి యొసంగుట అసాధ్యమని చెప్పిన చెప్పవచ్చును. కాని చాలకాలమువరకు అధినివేశ ప్రభుత్వము స్థాపింప వీలులేదనుట పొరబాటు. కొంతకాలములో సంపూర్ణమగు అధినివేశప్రతిపత్తి నేర్పరచునట్లుగా నిర్దుష్టమైన డొమినియన్ రాజ్యాంగవిధానము నిర్ణయించుట వీలగును. ప్రభుత్వమువారు తక్షణ అధినివేశ ప్రతిపత్తిని స్థాపింపజాలరనియు, రౌండుటేబిల్ సభను అవలంబించియైన సమావేశపరుపవలెననియు కాంగ్రెసు ప్రతినిధులు కోరిరి. ఇది సరసమగు పద్ధతి కాదు. రసల్ ప్రభువు చెప్పినదియు సరసమైనదికాదు. భారతదేశమునకు అధినివేశ ప్రతిపత్తి యొసంగుటయే ఆంగ్లప్రభుత్వ పద్ధతియొక్క ఆశయమని నిర్ణయింపబడినది. ఏపద్ధతులవలన, ఎంతకాలములో నను విషయములు రౌండుటేబిల్ సభలో చర్చలవలన తేలవలెను. ఇప్పుడు అధినివేశప్రతిపత్తి నొసంగవచ్చునా, చాలకాలమునరకు నొసంగ వీలులేదా యను విషయములు యిప్పుడు చర్చించుట రౌండుటేబిల్ సభయొక్క తీర్మానములను ముందుగా యూహించుట యగును. కావున అనవసరములు. ఇర్విన్-బెన్ ప్రకటనలకు రసల్గారి యుపన్యాసము విరుద్ధముగా నున్నది. సహాయకార్యదర్శి చెప్పినమాటలను తంతివార్తలు సరిగా తెలుపలేదేమో యని నేను తలచుచున్నాను.

### జిన్నాగారి యభిప్రాయము

జిన్నాగారిట్లు చెప్పిరి. "ప్రస్తుత స్థితులలో రసల్ ప్రభువు యిట్లు చెప్పుట న్యాయమగు రాజనీతి కాదు" అని నా యభిప్రాయము.

### సర్ ఫిరోజ్ సేత్నాగారి యభిప్రాయము

లిబరల్ ఫెడరేషనుయొక్క అధ్యక్షుడగు సర్ ఫిరోజ్ సేత్నాగారిట్లు చెప్పిరి.—

రసల్ ప్రభువు యొక్క ప్రకటన మన ఆంధవాలన్నిటిని తలక్రిందులు చేసినది. దేశము సంపూర్ణ స్వాతంత్ర్యమునకు తయారుగా నున్నదని మనము బ్రిటిష్ ప్రభుత్వమువారిని ఒప్పింపగలిగినచో తక్షణము అధినివేశస్వతంత్రము నివ్వవలెనని లిబరల్ పార్టీవారు కోరుచున్నారు. అట్లు ఒప్పింపలేకపోయినచో సరసమగు కొంతకాలములోగా నివ్వవలెనని వారు కోరుచున్నారు. చాలకాలమునరకు అధినివేశస్వాతంత్ర్యము మనకు యివ్వవీలులేనిచో రౌండుటేబిల్ సమావేశమువలన లాభమేమియు లేదు. బెన్గారును, ఇర్విన్ ప్రభువుగారును యిట్లుచెప్పియుండలేదు. కావున రసల్ ప్రభువుకు ఆంగ్ల మంత్రివర్గముయొక్క సహాయము లేదని యనుకొందును. ఈ సమయములో రసల్ ప్రభువు యిట్టిప్రకటన గావించుట మహోపద్రవకరము. కాంగ్రెస్వారి సంపూర్ణస్వాతంత్ర్య కార్యక్రమమును ప్రతిఘటించుచున్న పార్టీల ప్రయత్నములవిూద నీమాటలు చన్నీళ్లుచల్లి వారిని నిరుత్సాహవంతులుగా నొనరించుటకుమాత్రము సాయపడును.

## ఆచార్య నృపేంద్రచంద్ర బెనర్జీగారి అపీలు

### హైకోర్టువారు విచారణ నలుపుట కంగీకరించిరి

కలకత్తా, జనవరి 7:— శ్రీదేశబంధు చిత్తరంజనదాసుగారి నాలుగవ వర్ధంతి కడినమున కలకత్తాలోని మిర్జాపార్కులో జరిగిన సభయందు రాజద్రోహకరమగు నుపన్యాసము గావించిరని అ. భా. కాం. స. సభ్యులగు శ్రీ ఆచార్య నృపేంద్ర బెనర్జీగారికి అలిపూరు సహాయదండనాధికారి 1 సంవత్సరపు కఠినశిక్ష విధించియుండెను. అందుమీదట బెనర్జీగారు హైకోర్టువారికి అపీలు దాఖలు చేసిరి. న్యాయమూర్తులు పియర్సన్, పేటర్సన్గార్లు ఈ అపీలు విచారింపవలసినదని నిర్ణయించిరి.

కెన్పూర్ విద్యార్థిసమావేశములో రాజద్రోహకరమగు నుపన్యాసము నొసంగిరను నేరమునకై బెనర్జీగారికే నిర్బంధము ననుభవించుచుండుట పాఠకులకు జ్ఞప్తియుండ వచ్చును. (ఫ్రీ ప్రె.)

## మీరటు కుట్రకేసు

### మాజిస్ట్రేటునిర్ణయ మింకను దెలుపబడలేదు

మీరటు, జనవరి 7:— పై కేసులో మాజిస్ట్రేటుగారి నిర్ణయము జనవరి 9 వ తారీఖునందు దెలుపబడును. (ఫ్రీ ప్రె.)

## పైకారా జలపాతము విద్యుచ్ఛక్తి కొరకు పయోగింపబడుట

### నీలగిరి పర్వతప్రాంతమున విద్యుచ్ఛక్తితీగెల నిర్మాణము ముగిసెను

కూనూరు, జనవరి 6:— విద్యుచ్ఛక్తిని గొనిపోవు తంతులలో ముఖ్యమైనవానికి విద్యుచ్ఛక్తి ప్రవాహపుదిక్కును దూర్చగలయంత్రములు తగల్చవలయినది. కావున విద్యుచ్ఛక్తిసంబంధమైన యేర్పాట్లన్నియు ముగిసినవనే చెప్పవచ్చును. ప్రభుత్వమువారి ఎలక్ట్రికల్ ఇంజనీరగు మేజర్ హోవర్డుగారు పైపనులన్నింటిని తనిఖీ చేయుటకు వలయు నేర్పాట్లను గావించుటకును, వానిని ప్రారంభోత్సవము గావింపు డని మద్రాసు గవర్నరుగారిని కోరుటకును కూనూరు పురపాలకసంఘాధ్యక్షులగు ఎఫ్. డబ్ల్యూ. హాటనుగారు నిన్న చెన్నపురికి వెడలిరి. పైకారాలో సృష్టింపబడు విద్యుచ్ఛక్తిని పైనకొనిన తీగెలలో వచ్చునట్లు (యంత్రసహాయమున) గవర్నరుగారు గావించెదరు. ప్రారంభోత్సవదినమున గవర్నరుగారికిని, డిస్ట్రిక్టు స్టాన్లీ సతికిని ఆతిథ్యమొసంగబడును. (అ. ప్రె.)

## భారతశాస్త్రపరిశోధకుల సమావేశము

### 1931 సంవత్సరం జనవరినెలలో నాగపురమునందు జరుగ సమావేశ మగును

అలహాబాదు, జన 7:— సమావేశమువారిపరిశీలనకై దాఖలు చేయబడినవ్యాసముల నుపసంఘము లర్పించిన పిమ్మట, నేపటిదినము భారత శాస్త్రపరిశోధకుల సమావేశము ముగియును. హైందవ శాస్త్రపరిశోధక పరిషత్తుయొక్క కార్యనిర్వాహక సంఘమునకు నేడు సభ్యులెన్నకొనబడిరి. 1931 సంవత్సరం జనవరినెలలో నాగపురములో జరుగుచున్న భారతశాస్త్ర పరిశోధకుల సమావేశమునకు లెప్టినెంటు కల్నల్ ఆర్. బి. ఎస్. సూవెల్ గారధ్యక్షులుగా నుందురు. పోయినసంవత్సరపు కార్యదర్శియగు ఆచార్య బి. అఘర్ఖాన్గారు తిరుగా నాయుద్యోగమునే వహింతురు. భారతశాస్త్రపరిశోధకపరిషత్తువారి నిబంధనలలో ననుభవమును బట్టి ఎట్టిమార్పుల గావింపవలయునో చర్చించుటకును, దీని విషయమై ఆగస్టునెల ముగియులోగా సిఫార్సుల గావించుటకును యీక్రింది వారు సభ్యులుగా గల యుపసంఘము నెలకొల్పబడెను:—(1) సర్ సీ. వి. రామన్గారు (2) ఆచార్య జే. ఎన్. ముఖర్జీగారు (3) ఆచార్య హెచ్. సి. దాస్గుప్తాగారు (4) డాక్టర్ బేనీప్రసాద్గారు (5) కే. వాన్మానెన్గారు (6) ఆచార్య ఎస్. వి. అనుర్కార్గారు.

## రియాసత్, పత్రికాకార్యాలయములో పనిచేయుచున్న నలుగురిండ్లు శోధింపబడుట

### సబ్-ఎడిటరు అస్ఫరుహుసేన్గారిపై కేసు

మాలవ ఢిల్లీ, జన 7:— డిల్లీయందలి రియాసత్ వారపత్రికా కార్యాలయమునందు పనిచేయుచున్న నలుగురి-ఇండ్లను పోలీసులు నేడు శోధించిరి. భోపాలు సంస్థాన పరిపాలనవర్గమువారిని దూషించుచు వ్రాయబడిన యసంతృప్తి గ్రంథము నొకదానిని వారు తనుఖీము గావించుకొనిరని దలియుచున్నది.

రియాసత్ పత్రికా సంపాదకవర్గములో నొకరగు అస్ఫర్ హుసేన్గారిపై హైందవశిక్షాస్మృతి 292, 500, 501 విభాగములక్రింద భోపాల్ సంస్థానపు పోలీసు ప్రధానోద్యోగియగు ఖ్వాజా మొహమ్మద్ ఆక్రమ్ఖాన్గారు తమన్యాయవాదియగు ఖాన్బహదూర్ అబ్దుల్రహమాన్గారిద్వార దాఖలు చేసిన ఫిర్యాదుయొక్క ఫలితమే యీశోధన. (అ. ప్రె.)




## మితవాదుల నిరాశ

ఇండియా సహాయమంత్రి యగు రసెలు ప్రభువుగారు గావించిన ప్రసంగము, మితవాదసభాధ్యక్షులగు సెత్నాగారికి నిరాశ గలిగించుట సహజమే. టైమ్సు ఆఫ్ ఇండియా పత్రికా ప్రతినిధితో ముచ్చటించుచు, రసెలు ప్రభువుగారు హిందూదేశమన నేమియో ఎరుగరనియు, అధినివేశస్వాతంత్ర్యమును చాలకాలమువరకిచ్చుటకు ఇంగ్లండు సమ్మతింపనిచో, రౌండుటేబిలు సమావేశమును జరిపి లాభము లేదనియు, సెత్నాగారు చాటిరి. సెత్నాగారు మితవాదసభలో గావించిన ప్రారంభోపన్యాసమునందేమి, అంత్యోపన్యాసమునందేమి, సంపూర్ణస్వాతంత్ర్యవాదులను కసిదీర దూషించిరి. చేతికివచ్చిన అధినివేశస్వాతంత్ర్యమును వారు అవలపారవైచిరని, నిందించిరి. కాని, రసెలు ప్రభువుగారి ప్రతిపాదనమునకు పిమ్మట, వీరియాశ లడుగంటినవి. అయినను రసెలు ప్రభువుగారు బ్రిటీషు మంత్రివర్గాభిప్రాయమును తెలుపుచున్నారా యని, వీరికింకను సందియము కలదు. బ్రిటీషుమంత్రివర్గమువారు అధినివేశస్వాతంత్ర్యమును లక్ష్యముగ దెలుపుట దప్ప వేరు ఆశలను వారు గల్పింపరయిరి. ఇండియామంత్రి యగు వెడ్జివుడ్డుగారయినను, జేసిన వాగ్దాన మేమియు గనుపింపదు. రాజప్రతినిధిగారు గాంధి మహాత్మునితో సంప్రతించినపుడు, అధినివేశస్వాతంత్ర్యప్రదానము విషయమై తా మెట్టి వాగ్దానము చేయ వీలులేదని చాటిరి.

బాధ్యత గల ఇండియాసహాయమంత్రికి, వారి మనస్సు వారికి తెలియదని చెప్ప వీలులేదు. బ్రిటీషు ప్రభుత్వాభిప్రాయమును, ఇండియామంత్రిగారి యభిప్రాయమును బైకొనకుండ, స్వతంత్రించి ప్రత్యేకాభిప్రాయమును వీరు దెల్పిరని తలంపనవకాశము లేదు. కాంగ్రెసు నాయకులను మితవాదసభలో ఇచ్చవచ్చినటుల దూరిన సర్ చిమన్‌లాల్ సెతల్‌వాడుగారు గూడ రసెలు ప్రభువుగారి వాక్యములపట్ల ఆశ్చర్యమును వెలిబుచ్చిరి. అధినివేశస్వాతంత్ర్యము తక్షణమే సాధ్యము గాకపోయినను, త్వరలో నయినను దీని నేల ప్రసాదింప వీలులేదని, సెతల్‌వాడుగా రడుగుచున్నారు. రస్సెలు ప్రభువుగారి ప్రసంగము ఇర్విను వెడ్జివుడ్డు బెన్నుగార్ల ప్రసంగములకు విరుద్ధమని, సెతల్‌వాడుగారి యభిప్రాయము. కాని, ఎటుల విరుద్ధమో తెలియకున్నది. వెడ్జివుడ్డుబెన్నుగారయినను అధినివేశస్వాతంత్ర్యము శీఘ్రకాలములో ప్రసాదింపబడు నని వాగ్దానము జేసియుండలేదు. అధినివేశ స్వాతంత్ర్యమును లక్ష్యముగ మాత్రము ప్రకటించిరి. రౌండుటేబిలు సమావేశము గూడకముందే, యిట్టి ప్రసంగమును ఇండియా సహాయమంత్రి గావించియుండుట లోపమని, సెతల్‌వాడుగారు భావించుచున్నారు. కాని, సత్యము నిప్పటికయినను తేటపరచినందులకు, రస్సెలు ప్రభువుగారి నభినందింపవచ్చును. ఇంకను ముసుగులో గ్రుద్దులాటతో కాలము గడుపుట, ఎవరికిని లాభింపదు. భారతీయులిక ముందవలంబింపవలసిన కార్యక్రమము, రస్సెలు ప్రభువుగారి ప్రసంగమువలన, స్పష్టమయినది.

సెతల్‌వాడుగారి కింకను కొంతయాశ గలదు. రూటరు తంతివార్తలు రసెలుప్రభువుగారి ప్రసంగపు సంగ్రహమును తిన్నగ వివరింపలేదేమో యని భావించి వీరు తృప్తిజెందుచున్నారు. రసెలుప్రభువుగారి ప్రసంగమున కెట్టివిలువ లేదనియు, ఇండియామంత్రిగారు అధినివేశస్వాతంత్ర్యము నొసగుటకు వాగ్దానము జేసియుండ, సహాయమంత్రిగారి నుడువులను పాటింపనిలేదనియు, వీరు దెలుపుట చోద్యము. ఇండియా మంత్రిగారయినను, రస్సెలు ప్రభువుగారికన్న నెక్కుడు అనుకూలవాగ్దానము నేమి గావించిరో తెలియదు. రసెలుప్రభువుగారు దూరదృష్టిలేకుండ ప్రసంగించిరని, జిన్నాగారును, సంపూర్ణస్వాతంత్ర్యప్రచారము నెదుర్కొనుటకు బూనిన మితవాదుల యుత్సాహముపై చలినీళ్లు జల్లిరని సెత్నాగారును బలుకుట జూడ, వీరింకను తాము గల్పించుకొనిన భ్రమనుండి బయల్పడుటకు ఇష్టపడుటలేదని తోచును. వీరియభిప్రాయ మెటులున్నను, కాంగ్రెసుపక్షమువారు మాత్రము రస్సెలు ప్రభువుగారు తమ ప్రసంగమువలన హిందూదేశమునకు పరోక్షముగ మేలుజేసిరనియే భావింపకమానరు. భారతీయులు లేనిపోని యాశలలో జిక్కుకొనకుండ, వీరు కాపాడిరని చెప్పవచ్చును. మితవాదనాయకు లయినను తమ నావరించిన భ్రమను విడనాడి, కాంగ్రెసుతో చేతులగలిపి పాటుబడుట శ్రేయస్కరమగును. జస్టిసుపక్షనాయకు లగు దా॥ బా॥ బి. మునిస్వామినాయుడుగారుగూడ, రస్సెలు ప్రభువుగారు లేబరుపక్షాభిప్రాయమును దెలుపుచున్నయెడల, రౌండుటేబిలు సమావేశమునందు కాంగ్రెసుపక్షేతరులుగూడ పాల్గొనజాలరని హిందూపత్రికా ప్రతినిధితో నుడివియుండిరి. ఇట్టి పరిస్థితులలో నిరర్థకపు రౌండుటేబిలు సమావేశము జరుగనియెడల, చింతించువా రుండబోరు.

పైవ్యాసమును వ్రాసినపిమ్మట, రూటరు ప్రతినిధితో రసెలు ప్రభువుగారు ముచ్చటించుచు, తా మట్టిప్రసంగము గావింపలేదని, తెలిపిరను వార్త చేరెను. ఇంతకన్నను తా మీవిషయమై యేమియు చెప్ప దలచికొనలేదని, రస్సెలు ప్రభువుగారు చెప్పిరి గాని, తా మాసభలో నేమి చెప్పినదియు, వారు దెలుపకపోయిరి. ఈ విషయమై సందియముల నెల్ల బోద్రోలుటకు, బ్రిటీషు ప్రభుత్వమువారు తమ నిశ్చయాభిప్రాయమును ప్రకటించుట మేలగును. రస్సెలుప్రభువుగా రిదివరకు దెలిపినటుల ప్రసంగించియున్నను, ఆశ్చర్యముండదు. ఇతరు లింతకన్నను ముందుకు బోయియుండలేదు. ఈసంగతిని స్పష్టముగ వెలిబుచ్చి, మితవాదుల అలజడి నయినను, వీరు తీర్చెదరో లేదో చూడవలయును.

## నానారాష్ట్రసంఘసమావేశము

రాబోవు సోమవారమునాడు జినీవాలో నానారాష్ట్రసంఘసభ గూడనున్నది. ఇంగ్లండు తరఫున హెండర్సనుగారు ప్రతినిధిగ వెళ్లెదరు. ఈసభలో చర్చింపబడు విషయములు చాల ముఖ్యము లయినను, అనుకూలనిర్ణయము జరుగునను ఆశ కవకాశము గనుపింపదు. గత సెప్టెంబరు మాసములో జరిగిన నానారాష్ట్ర సంఘసభలో, యుద్ధమును పూర్తిగ త్యజింపని ఒడంబడికలను, యుద్ధబహిష్కారపు టొడంబడిక కనుగుణముగ సవరింపవలయునని చేయబడిన సూచన చర్చింపబడును. యుద్ధబహిష్కారమును, నానారాష్ట్రసంఘము నిర్ణయించియుండలేదు. అందుచే యుద్ధబహిష్కారమున కంగీకరించిన జాతులు, నానారాష్ట్రసంఘసభావ్యవహారములను గూడ నిట్టి లక్ష్యమున కనుగుణముగ మార్చుటకు యత్నించినగాని, ప్రయోజనముండదు. ఇట్టిమార్పులను సూచించుట కొక ఉపసంఘము నియమింపబడునట. మరియొక విషయము సుంకముల విరామమునకు సంబంధించినది. రెండుసంవత్సరములవరకు ఎట్టి సుంకములను విధింప వీలుండగూడదను సూచన చర్చకు వచ్చును. నానారాష్ట్రసంఘమునందు హిందూదేశము గూడ సభ్యరాలు గాన, హిందూదేశముతరఫున గూడ ఈ సూచన నంగీకరించుచో, ప్రబలనష్టము గలుగును. పారిశ్రామిక వాణిజ్య రక్షణపద్ధతి హిందూదేశమునకు ముఖ్యావశ్యకము. లేనియెడల, హిందూదేశవాణిజ్యము తలయెత్తుట కవకాశ ముండదు. పరిశ్రమలందును, వాణిజ్యమునందును అభివృద్ధి జెందిన దేశములు సుంకములను మానుకొన నంగీకరింపవచ్చును గాని, హిందూదేశ మంగీకరించుట ఆత్మహత్యయే యగును. పరిశ్రమలందు ముందడుగు వైచిన దేశము లన్నియు ప్రాథమికావస్థలో సుంకములను విధించియే, తమ పరిశ్రమలను కాపాడుకొనియుండెను. నానారాష్ట్రసంఘసభలోని హిందూదేశప్రతినిధి, హిందూదేశాభిప్రాయమును వ్యక్తపరుపగలడని తోపదు. ఇతడు ప్రజలచే నెన్నుకొనబడినప్రతినిధి గాడని తెలిసిన విషయమే. ఇండియాప్రభుత్వమువారీ విషయమై ఎంతవరకు పట్టుదల జూపి హిందూదేశాభిప్రాయమును వ్యక్తపరచెదరో తెలియదు. స్వపరిపాలనాస్వాతంత్ర్యము లేని దేశములకు నానారాష్ట్రసంఘము మున్నగు అంతర్జాతీయసంస్థలలో ప్రాతినిధ్య మిచ్చుటవలన, లాభముకన్న నష్ట మధికముగ గలుగునని, తేటతెల్లమగుచున్నది. నానారాష్ట్రసంఘమువలన గలుగు లాభములు లేకపోగ, హిందూదేశము మితిమీరిన ఖర్చులను మాత్రము భరింపవలసి వచ్చుచున్నది. అధినివేశస్వాతంత్ర్యము ఆచరణలో నిదివరకే చేకూరెనని, ఇండియా మంత్రిగారు దెలుపుట కిందువలననే యయినను, ఇది సత్యవిరుద్ధమని ఏమాత్ర మాలోచించినను విదితము గాగలదు. మాండేటు దేశములవ్యవహారముల కొకదారి యెన్నడు కనుపించుటలేదు. మాండేటుకి దేశములు, నానారాష్ట్రసంఘముక్రింద పనిజేయుచున్నటుల జెప్పబడినను, వీని పరిపాలనముపట్ల నానారాష్ట్రసంఘమువారు శ్రద్ధ దీసికొనుచున్నటులగాని, వీనికి స్వాతంత్ర్యమిచ్చుటకు ముందుకువచ్చినటులగాని గనుపిం

కదు. మాండేటరీ దేశములు పరాధీనదేశములస్థితిలోకి వచ్చినవి. పెద్దజాతులవారి పరిపాలనక్రింద నుండు దేశముల విస్తీర్ణమును పెంచుట కివి తోడ్పడుచున్నవి. వారియధికారమును లాభములను విస్తరింప జేయుచున్నవి. బ్రిటీషువారిక్రింద నున్న ఇరాక్ పరిపాలనగూర్చియు న్యూజిలెండు క్రింద నున్న పశ్చిమ సామోదేశ పరిపాలనముగూర్చియు, మాండేటు కమిషనువారి విమర్శనములను, నానా రాష్ట్రసంఘమువారీమారు విచారించెదరట. దీనికి ఫలముగ ఈ దేశములకు స్వేచ్ఛ నొసగిన మేలుగ నుండును. అందుకుమారుగ తుచ్ఛచర్చల గావించుటవలన ప్రయోజన ముండదు. పాలెస్తీనులోని జెరూసలెమునందు పవిత్రమగు వెయిలింగువాల్ గూర్చి యూధులకునుమహమ్మదీయులకును ఈమధ్య పోరాటములు పెరిగెను. అల్లరులుజరిగెను. ఈగోడ ఎవరికి చెందునను విషయమును విచారించి నిర్ణయించుటకు, ఒక కమిషను నియమింపబడునట. పాలెస్తీను సమస్య యింతటితో పరిష్కారము గాజాలదు. దీనిని యూధభూమిగ గావించుటకు బాల్ఫరుగారు సూచించిన ఏర్పాటును విడనాడినగాని, అరబ్బులకును యూధులకును పరిష్కారము కుదరజాలదు. ఇటీవల జరిగిన అల్లరుల గూర్చి విచారించుట కొక కమిషను ఏర్పడియుండెను. మరల నొక కమిషను ఏర్పడనున్నది. ఇట్టి కమిషనులు, ప్రధాన సమస్యను పరిష్కరింపగల వని తోచదు.

---

అఖిలభారత ఆయుర్వేద వైద్యసమ్మేళనము

1 వ తేదిన కరాచీలో జరిగిన ఇరువదవ అఖిల భారత ఆయుర్వేద వైద్య సమ్మేళమున కధ్యక్షత వహించి, వైద్యరత్న పండిత రామప్రసాద శర్మగారు, ఆయుర్వేద వైద్యశాస్త్రమును చక్కగ తేటపరచిరి. ఆయుర్వేదము వేదములలో నొకభాగమనియు, అధర్వవేదమునం దిది వివరింపబడె ననియు, అందుచే నిది ప్రమాణమనియు, సూచించిరి. వేదములు ఓషధులపటిమను వివరించి యుండెను. వేదమంత్రములలో వైద్యశాస్త్రము గలదు. దర్శనములలో గూడ నీ విషయము పొందుపరుపబడెను. ఆయుర్వేద మన్నిజాతులవారికిని, అన్నిసంఘముల వారికిని సంబంధించిన శాస్త్రము. కపిలుడు తన సాంఖ్యసిద్ధాంతమునందు ప్రకృతి ఎటుల పరిణామము గాంచెనో తేటపరచి యుండెను. పంచభూతముల పరస్పర సంబంధమును కణాదుడు తన వైశేషిక సిద్ధాంతమునందు తెలిపి యుండెను. పతంజలి తన యోగసిద్ధాంతము ద్వారా జీవుడు పరమేశ్వరునితో కలియుటకు వలయు సాధనలను సూచించెను. వ్యాసుడు తన వేదాంతశాస్త్రమునందు, జీవబ్రహ్మైక్యమును వివరించెను. ఆయుర్వేదమును షడ్దర్శనములలో నంతర్భాగమే, యని అధ్యక్షులు తేటపరచిరి. వ్యక్తులకేది బాధనిచ్చునో, అదియే వ్యాధియని నిరూపింపబడెను. వ్యాధులలో శారీరక మానసిక వ్యాధులు గలవు. జననమరణములు రెండును స్వాభావికవ్యాధు లని గుర్తింపబడెను. వీనినుండి విముక్తు లగు కటులని, షడ్దర్శనములు చర్చించి యుండుటచే, ఆయుర్వేదసూత్రములే వీనియందు ప్రతిధ్వనించెనని అధ్యక్షు లభిప్రాయపడిరి. ఆయుర్వేదవైద్యులు, శారీరక, మానసిక వ్యాధుల స్వభావమును, వాని పరస్పరసంబంధమును గుర్తెరుగుట యవసరమగుచున్నది. చరకసుశ్రుత గ్రంథములలో, ఇటీవల బయల్వెడలిన సాంక్రామికవ్యాధు లగు ప్లేగు, ఇన్ఫ్లుయెంజా మున్నగు వ్యాధుల గూర్చి చికిత్సలు వివరింపబడియుండెను. ఆయుర్వేదమునందలి రోగనిర్ణయవిధాన మిప్పటికిని నిరుపమానమై యొప్పుచున్నది. త్రిదోష పద్ధతి, రోగముల శాశ్వతోకారణములను దెలుపుచు, చికిత్సలను గూడ స్పష్టపరచుచున్నది. కాని, దీనిని బాగుగ గ్రహింపనివారనేకులు వైద్యమును చేపట్టుటచే, దీని ప్రఖ్యాతికి భంగము గలుగుచున్నది. అధ్యక్షులు దెల్పినటుల, ఆయుర్వేదవైద్యమునకు ఖర్చు విశేష మవసరములేదు. అట్టహాసముతో బని యుండదు. మఱ్ఱిచెట్టుక్రింద గూర్చుని దానిసహాయముతో ప్రతిదినము పెక్కురోగములను నివారణ జేయవచ్చునని, అధ్యక్షులు నుడివిరి. ప్రాచీనకాలమున శస్త్రచికిత్సయందుగూడ ఆయుర్వేదవైద్యులు ఆరితేరినటుల, నిదర్శనములు గలవు. కాని యిది యింతయు నేడు విస్మృత మయినది. అంటురోగములు రాకముందే, ఎప్పుడు వచ్చునో కనుగొని, నివారణోపాయము నవలంబించెడివారట. రోగచికిత్సకే గాక, రోగనివారణకు సంబంధించిన ఆరోగ్యరక్షణమునందును, పరిశుభ్రతను కాపాడుటయందునుగూడ, ప్రాచీన భారతవర్షము ప్రసిద్ధి గాంచెను. ఆయుర్వేదవైద్యశాస్త్రమునుగూర్చి ఇంకను ప్రచారముసలుప నవసరము లేదు. దేశమునం దీవిషయమై విశ్వాసము ప్రబలియున్నది. కాని, ఆయుర్వేదవైద్యవ్యాప్తికి వలయు సాధనముల నరయవలయును. కార్యోత్సాహమును జూపవలయును. ప్రభుత్వమువా రిటీవల కొంత ప్రోత్సాహమొసగుచున్నను, ఇది తగినంతగ చేకూరుటలేదు. అందుచే, ప్రజలే యీకార్యమును చేపట్టి పాటుబడవలసిన యవసరము గలదు. నిరుత్సాహకర మగు పరిస్థితులమధ్య దేశీయ వైద్యమునకై పాటుబడుచున్న భిషగ్వరులును తదితరులును అభినందనార్హులు. వీరు సలుపుచున్న కృషికి భారతీయులు తోడ్పడి, చౌకయు సులభసాధ్యము నగు ఆయుర్వేద వైద్యమును కాపాడుట యత్యవసరము. అఖిలభారత ఆయుర్వేద మహాసభవలన శాశ్వతలాభము చేకూరుగాక యని కోరెదము.

---

మార్నింగుపోస్టు అగడము

కాంగ్రెసునందు సిక్కునాయకు లగు కరక్ సింగుగారు, గాంధిమహాత్మునితో చేతులగలిపి సంపూర్ణస్వాతంత్ర్యమునకై తోడ్పడ సమ్మతించినందుకు, మార్నింగుపోస్టు పత్రికకు మితిలేనివిషాదము గలిగెను. ప్రభుత్వమువారు సిక్కులను జేరదీసినచో; వారు గాంధివైపుకు బోయెడివారు గారని, యీపత్రిక నింద మోపుచున్నది. విభజించి పాలించుసూత్రమే, యీపత్రికకు ముఖ్యము. ఇకమీద కొందరుబేవిలునమావేశము జరిగినను, వ్యర్థ మగునని, యీపత్రికతలంపు. మార్నింగు పోస్టు, డెయిలీమెయిలుపత్రిక లుపయోగించుచున్న భాష, హిందూదేశమునకు తీరనిహాని గలిగించుననని, డెయిలీహెరాల్డుపత్రిక మందలించుచున్నది. కాని, లేబరుపక్షమువారయినను స్వతంత్రించి హిందూదేశమునకు ఎట్టి మేలు-జేయ దలపెట్టనపుడు, కన్సర్వేటివుపత్రికలను నిందించి ప్రయోజన మేముండును? ఈపత్రికలు ఎట్టి పరుషభాష నుపయోగించినను, తమ నిశ్చయాభిప్రాయము నయినను తెలుపుచున్నవి. లేబరుపక్షపత్రికలు అతున కందని పోకను పొందని విధముగ ప్రవర్తించి పరిస్థితులను చక్కబరుపజాలకున్నవి.

---

జర్మను నష్టపరిహారసమస్య

జర్మను నష్టపరిహారసమస్య యింకను చిక్కుల నుండి బయల్పడలేదు. హేగునందు జరిగిన నష్టపరిహారసమావేశములో, నష్టపరిహార ద్రవ్యమును ఎప్పుడు చెల్లింపవలయు ననువిషయమై వివాదమేర్పడెను. ప్రతిమాసమునందును పదునైదవ తేదినాడు చెల్లింపవలయునని, మిత్రమండలివారు దెలుపగ, మాసాంతమున చెల్లించెద మని జర్మను ప్రతినిధులు దెలిపిరి. ఆలోపల చెల్లించునెడల, వడ్డీ నష్టమగునని జర్మనులవాదము. జర్మను షరతుల నంగీకరించుచో, తమకు చాల నష్టము గలుగునని, మిత్రమండలివారు పట్టుదల జూపిరి. రేపటిదినము మరల నీవిషయమై చర్చ జరుగును. నష్టపరిహార ద్రవ్యమును సకాలమున చెల్లింపనిచో, ఎట్టి శిక్షలుండవలయు ననువిషయము చర్చకు రాగ, బ్రిటీషువారిట్టిశిక్షలతో బనిలేదని తెలిపిరట. కాని, ఫ్రెంచివారు మాత్రము ఈ విషయమున తమసూచనలను దెలిపెదరు. యుద్ధఫలిత మగు నష్టపరిహారసమస్య పరిష్కారమగుట కింకను ఎంతకాలము గడువవలయునో తెలియకున్నది. ఇది జరుగువరకు, యూరపునందు శాంతి స్థిరముగ నెలకొనుటకు వీలుండదు.

---

# జాతీయపతాకను దించరాదు

## సుభాష్‌బోసుగారి పూర్ణస్వరాజ్యప్రచారము

### సందిగ్ధసమయములయందు అగ్రేసరుడుగా నుండెదను

కలకత్తా, జనవరి 7 :—లాహోరు జాతీయ మహాసభవారు నిర్ణయించిన కార్యక్రమముతో నేకీభవించకపోవచ్చును. కాని దానిని విశ్వాసముతో కొనసాగించుచు నుండుటే ఏకైక తీవ్రకార్యక్రమముకొరకు నే యుండును సంపూర్ణస్వాతంత్ర్యదర్శమునుగూర్చి మనలో నేకీభావమున్నంతకాలము వివరములలో భేదములవిషయమై భయపడవలసిన యవసరములేదు. జాతీయజీవనమునందు విషమస్థితి యేర్పడునప్పుడు అందరికన్న ముందుగా నుందునో లేదో యనునదే నిజమయిన పరీక్ష కాగలదు. ఆ పరీక్షాసమయమున నేను వెనుకబడియుండనని చెప్పగలను! యని శ్రద్ధానంద పార్కునందలి సభలో ఉపన్యసించుచు శ్రీయుత సుభాష్‌చంద్రబోసుగారు నుడివిరి. ఇంకను వారిట్లు చెప్పిరి.

రేపు అధినివేశ ప్రతిపత్తి నొసంగినచో నంగీకరించెదరా యని నన్ను పలువురు అడుగుచున్నారు. సంపూర్ణస్వాతంత్ర్యముకై మన యాందోళన నిజమైనదే యగునో, కేవలము ఎత్తులకొరకై ఉపయోగింపబడు గంభీర పదజాలము మాత్రమే కానిచో మన యాదర్శములలో నించుకయు తగ్గించుకొని [illegible] నేను ప్రత్యుత్తర మొసంగను. రేపు అధినివేశప్రతిపత్తి నొసంగెదమని యనినను, విన్నందు దేశమునందు [illegible] ప్రజాస్వామ్యపక్షమునందు చేర్చి మన సంపూర్ణస్వాతంత్ర్యాందోళనను సాగించుచుండుట మన విధియై యుండును. పోరాటమునందు అలసిపోలేని కాంతిహీనులై [illegible] అధినివేశప్రతిపత్తి నంగీకరించిన [illegible] కాలిన్సు ప్రభృతులు చేసిన పొరబాటును మనము కావించకుందుముగాక. ఎన్ని కష్టములు వచ్చినను, ఎంత త్యాగము చేయవలసివచ్చినను లాహోరులో 31 తారీఖున ఉదయము 6 గంటలకు ప్రతిష్ఠింపబడిన భారతజాతీయపతాకనించుకయు దింపకుండెదముగాక. (ఫ్రీప్రెస్)

# శాసనసభ్యుల రాజీనామాలు

## పెరుమాళ్ళునాయుడుగారు అసెంబ్లీ సభ్యత్వము వదలుట

ఆంధ్ర ఎం. ఎల్. ఏ. లు అందరు యింకతో రాజీనామా నిచ్చిరి

(స్వకీయవిలేఖరి)

నెల్లూరు, జనవరి 7:—బి. పెరుమాళ్ళునాయుడుగారు భారతశాసనసభ్యులు యిట్లు తెలుపుచున్నారు. "కాంగ్రెసు విశదముగ ఆజ్ఞాపించిన పిదప కూడ నిజముగ కాంగ్రెసు వాది యెవ్వరును అనుమానింపరాదు. చేయవలసినది ఒక్కటే. మాట్లాడక కాంగ్రెసు ఆజ్ఞననుసరించి వెంటనే రాజీనామా పంపవలెను. నా రాజీనామాను పంపించితిని."

### డా॥ యు. రామారావుగారి రాజీనామా

మదరాసు, జనవరి 8:— డా॥ యు. రామారావుగారు స్టేటుకౌన్సిలు సభ్యులు యిట్లు ప్రకటించుచున్నారు:—

"కాంగ్రెసు ఉత్తరవు ప్రకారము నేను నేడే స్టేటుకౌన్సిలు సభ్యత్వమునకు రాజీనామా పంపుచున్నాను. నేను శాసనసభా కార్యక్రమమునందు సంపూర్ణ విశ్వాసముగలవాడను. నా క్షేంజర్లు అస్పృశ్యతానివారణయందు కద్దరు, మద్యనిషేధ కార్యములందు నిమగ్నుడై యుంటిని. ఇట్టి ముఖ్యసమయమున శాసనసభలను బహిష్కరింపవలెనని కాంగ్రెసు నిర్ణయించుట చాలదురదృష్టము. సందిగ్ధసమయములందు నిర్బంధశాసనము లేనియెడ నిరంకుశాధికారులు చెప్పుచేతలలోనుండు సభ్యుల సహాయమున అమలు జరుగకుండ నిరోధకవర్గమువారిని కాపాడవలసిన ఆవశ్యకత మనయందుగలదు. కాంగ్రెసువారు బయటనుండి వచ్చో యీ బాధ్యత నెరవేర్ప వీలులేదు. కాంగ్రెసు శాసనసభ్యులు ఏమియు మేలు చేకూర్ప లేకపోయిరని వాదించినను ఇతరులు హానిచేయకుండ కాపాడగలరు. ప్రభుత్వమువారి నిరంకుశచర్యలను నిరసించు ప్రజాభిప్రాయమును వెల్లడిచేయగలరు. అయినను కాంగ్రెసు కట్టుదిట్టములకు భంగముకలుగకుండ ఆజ్ఞను శిరసావహించి రాజీనామా నిచ్చుచున్నాను. ఓటర్లు నన్నుగూర్చి దురభిప్రాయ పడకుందురని నమ్ముచున్నాను. తప్పనిసరియగుటచే అవసరసమయమున వారిని విడువవలసివచ్చినది. సభలోనున్నంతకాలము వారి క్షేమముకొరకే పాటుబడితిని. అప్పుట సేవాసర్పిన కృషియే యిందుకు నిదర్శనము."

## మోతే నారాయణరావుగారి రాజీనామా

వెంటనే రాజీనామాలను పంపుట

శాసనసభ్యులధర్మము

(ప్రత్యేకవిలేఖరి)

ఏలూరు, జనవరి 7:—శ్రీయుత మోతే నారాయణరావుగారు జమీందారు నేడు మద్రాసు గవర్నరుగారికి తమ శాసనసభ్యత్వరాజీనామాను పంపిరి. ఆరాజీనామాయందీ క్రింది విధమున గలదు. "పశ్చిమగోదావరిజిల్లా మహమ్మదీయేతర నియోజకవర్గప్రతినిధిగ మద్రాసు శాసనసభలో నాకు గల సభ్యత్వస్థానమునకు కాంగ్రెసు ఆదేశము ననుసరించి నేను రాజీనామా నొసగుచున్నాను".

శ్రీయుత నారాయణరావుగారు తమయభిప్రాయమును మాతో నిట్లు తెలిపిరి. "కాంగ్రెసుఆదేశము ననుసరించి దేశమున గల వివిధశాసనసభలనుండియు కాంగ్రెసు సభ్యులు వెంటనే రాజీనామా నొసగుట వారిప్రధానకర్తవ్యమై యున్నది. కొందరు మద్రాసు కాంగ్రెసు కౌన్సిలర్లు సూచించినటుల యీపక్షము వారి సభనుజరిపి కర్తవ్యము నిర్ణయించుటకుగాని అందరును ఒకేసారి రాజీనామా నిచ్చుటకుగాని నాకు తగిన కారణములు కన్పింపవు. కావున నారాజీనామాను పంపుటకు ఇంకను నేను ఆలస్యము చేయజాలనైతిని. కాంగ్రెసుమహాసభ లోకలుబోర్డులను, మ్యునిసిపాలిటీలను గూడ బహిష్కరించుచు తీర్మానించినచో కాంగ్రెసు సభాగౌరవ మినుమడించియుండుటయే గాక ఆసంస్థలందు పక్షవివాదములు చూడ అంతరించియుండును. ప్రస్తుత పరిపాలనావిధానమున శాసనసభలలో పనిచేయుటవలన ప్రయోజన మిసుమంతైన కలుగునని నేనెప్పుడును విశ్వసించుటలేదు. దేశమునకు ముఖ్యావసరము లగు కార్యములు శాసనసభలద్వారా నెరవేరవని నా యనుభవమువలన నేను తెలిసికొంటిని. కావున కాంగ్రెసుకౌన్సిలర్లు అందరు వెంటనే రాజీనామాల నొసంగి తమకాలమును, శక్తిసామర్థ్యములను పూర్తిగ వినియోగించి కాంగ్రెసు ఉద్యమమును కొనసాగజేయవలెనని నేను కోరుచున్నాను. ప్రస్తుతసమయమున కాంగ్రెసునందు నూతనపక్షములను నెలకొల్పి కాంగ్రెసుబలమునడిని క్షీణింపజేయుట ఆత్మహత్యగావించుకొనుటయే యగును. భారతదేశ సహాయ కార్యదర్శి రస్సెలుప్రభువుగారు డొమినియను స్టేటసును యిప్పుడుగాని యికముందు త్వరలోగాని యొసగుటకు వీలులేదని చెప్పినపుడు కాంగ్రెసుబలమును తగ్గింపగూడదు. మద్రాసు కాంగ్రెసుకౌన్సిలర్లు ఇంకను ఆలసింపక రాజీనామాల నిచ్చి, కాంగ్రెసు కార్యక్రమమును కొనసాగజేయుదు రనియు రాబోవు పోరాటమునకు దేశమును సంసిద్ధపరచెదరనియే నేను విశ్వసించుచున్నాను" అని మోతే నారాయణరావుగారు తమ అభిప్రాయమును తెలిపిరి.

### ఆర్. కె. షణ్ముగంచెట్టిగారి రాజీనామా

కోయంబత్తూరు, జన 8:— ఆర్. కె. షణ్ముగంచెట్టిగారు పత్రికాప్రతినిధితో యిట్లు తెలిపిరి:—

"లాహోరులో కాంగ్రెసు యొనర్చిన తప్పిదము కలకత్తా కాంగ్రెసులో జరిగిన దుష్ప్రయత్నముల ఫలితము. కలకత్తా కాంగ్రెసులో నెహ్రూ నివేదికను అవమానపరచు నుద్దేశించిన వారి యత్నముల వల్లనే అట్లు జరిగెనని నేను అందు పాల్గొనిన అనుభవముచే చెప్పగలను. కలకత్తాలో కుంటువారలకు లొంగిపోవుట మహాత్ముని ఘోర తప్పిదమగును. లాహోరులో మహాత్ముడు నాటి పొరబాటునే కొనసాగించెను. స్వాతంత్ర్యప్రకటన శాసనసభా బహిష్కరణము సిద్ధాంతములు న్యాయముగ నున్నవా లేదా యను చర్చ యటుండ దేశము సిద్ధముగలేనిది యీ ప్రత్యక్షపోరాటము నిర్ణయించుట పొరపాటు. దేశమును శాసనోల్లంఘనమునకు సంసిద్ధపరచిన పిమ్మట యిట్లు చేయవలెను గాని పూర్వముగాదు. శాసనసభలను, రౌండుటేబిలుసభను యీసమయమున బహిష్కరించుట నిరర్థకముగుటయేగాక, జాతీయాన్మత్వమునకు నష్టదాయకము. ఎన్నికల ఒడంబడిక ప్రకారము నేను ఎసంబ్లీ సభ్యత్వమునకు రాజీనామా పంపుచున్నాను. గౌరవనీయులగువారు చేయదగ్గపని అదియే. తిరిగి ఎన్నికలలో స్వతంత్రముగ పోటీచేయదలచితిని." (ఆ. ప్రె.)

### అస్సాం కాంగ్రెసు శాసనసభ్యులు

గౌహతి, జన 7:—అస్సాము శాసనసభలో కాంగ్రెసు కౌన్సిలు పార్టీ నాయకుడగు నాబిను బార్డోలిగారు జనవరి 18 వ తేదిన సభ్యులందరిని సమావేశము గావించిరి. రాజీనామాల గూర్చి చర్చింతురు. పలుసభ్యులందరు రాజీనామా నిత్తురనియే తెలియవచ్చెను.

### కలకత్తాలో రాజీనామాలు

కలకత్తా, జన 7:—డా॥ ప్రమదనాథ బెనర్జీగారు కలకత్తా విశ్వవిద్యాలయము ఎకనమిక్సు ప్రొఫెసరు వంగరాష్ట్ర శాసనసభలో తమ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చుచు కాంగ్రెసునిర్ణయము ప్రస్తుతపరిస్థితులలో ఉచితముగ లేదనిరి.

బెంగాలు శాసనసభలో మహిశానచంద్రబోసు యోగేంద్రనాథ్ మైత్రా (పాబ్నా) సురేంద్రమోహన మైత్రాగార్లు రాజీనామాల నొసంగినట్లు అనధికారవార్త తెలుపుచున్నది. (ఆ. ప్రె)

### రంగూను పురపాలకసంఘము

జనవరి 7 వ తేదీ సాయంకాలము జరిగిన రంగూను పురపాలక సంఘసభలో కెప్టెన్ ఆర్. బి. రసల్, ఎం. బీ. యీ. గారు నూతనవత్సరమున కధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. పోటీలేక ఎన్నిక ఏకగ్రీవముగా జరిగినది. వీరికిముందు మీర్జా మొహమ్మద్ రఫీ ఎం. ఎల్. సీ. గా రధ్యక్షులుగా నుండిరి. (ఆ. ప్రె.)

### శ్రీసనాతనవిద్యాలయము రాజమహేంద్రవరం భూరివిరాళము.

పల్లకల్లిసంస్థానాధీశ్వరులు శ్రీయుత శ్రీరాజా యార్లగడ్డ శివరామప్రసాదు బహద్దరు జమీందారువారి పట్టాభిషేక మహోత్సవసమయమున ది 30-12-29 వ తేదీని శ్రీసనాతన విద్యాలయమునకు రు 175 లు విరాళమును దయచేయించిరి.

దు. సుబ్బమ్మ,
స్థాపకురాలు.

## ఆంధ్రదేశమున శాసనోల్లంఘనము

ఉచితస్థలముగూర్చి ప్రకాశంపంతులుగారు మున్నగువారు యోచించుట

సెటిల్మెంటు ఉపసంఘసభ్యుల రాజీనామాలు

### ప్రకాశంపంతులుగారి ప్రకటన

మదరాసు, జన 8:—శ్రీ టి. ప్రకాశంగారు యీదిగువరీతి వ్రాయుచున్నారు. శాసనసభలోనున్న కొందరుమిత్రులు తాము రాజీనామాలనిచ్చినతోడనే కాంగ్రెసు ఉత్తరవు నిర్వహించినట్లు ఎంచుచున్నారు. మరికొందరు కాంగ్రెసు వర్కింగు కమిటీల నిర్ణయములను మనము విమర్శింపరాదని భావించుచున్నారు. ఈరెండు తెగలవారితో నే నేకీభవింపను. కాంగ్రెసు నిర్ణయము శిరసావహనముగా నంగీకరింపవలెనన్నచో వెంటనే రాజీనామా పంపుటయేగాక మనముందగు దేశములో నికిపోయి శాసనోల్లంఘనచేయుటకు తగినతావు ఏర్పాటుచేసికొని అందుకు తగుకృషి చేయవలెను. వేరొక యుత్తరవు వచ్చువరకు, దేశములో చేయవలసినపనిమాట తలపెట్టక కాంగ్రెసు ఉత్తరవు ననుసరించితిమని విర్రవీగుటయు ఉత్తరవు నెరవేర్చితిమనుటయు. అ. భా. కాంగ్రెసు నిర్ణయము తప్పనితలంచువారు తమ అభిప్రాయము వెల్లడించి తప్పు దిద్దుటకు తగుకృషి చేయకున్నచో తమవిధి నెరవేర్పజాలకుందురు.

### ఆంధ్రమండలములపన్నులబాధ

స్థానికశాసనసభ్యులగు కొందరు ఆంధ్రమిత్రులను నేను నిన్న సందర్శించి భావికర్తవ్యమునుగూర్చి చర్చించియుంటిని. సెటిల్మెంటు ఆఫీసరు సిఫార్సుచేసిన రూపాయికి 3 అణాల భూమిపన్ను వృద్ధి న్యాయముగనో కాదో నిర్ణయింప శాసనసభా తీర్మానము ప్రకారము ప్రభుత్వమువారిచే నియమింపబడిన ఉపసంఘసభ్యులు కొందరు జీతము లేకుండ పనిచేయుచున్నారు. వారు నేటివరకు తమ నివేదికను పూర్తి చేయజాలకుండిరి. వారు నివేదికను తయారుచేయుటయందు నిమగ్నులై యుండగ లాహోరు కాంగ్రెసులో బహిష్కార తీర్మానము గావింపబడినది. వీరు రాజీనామా నీయవలెనని కాంగ్రెసు కోరినది. నివేదికయందు సంతకము చేయువరకు రాజీనామా నీయకుండుట కాంగ్రెసు ఉత్తరవు నుల్లంఘించినట్లగునాయని నేను చర్చించియుంటిమి. ఉల్లంఘించుట కానేరదని వారు దలంచిరి. నేను అంగీకరించితిని. ఒకవేళ యుల్లంఘించుటయేయైనను ప్రస్తుత పరిస్థితులలో అట్లుచేయక తప్పదు. ఈయుపసంఘము నియమింపవలెనని శాసనసభలో ఆందోళన జరుపకుండినచో రూపాయి వద్ద మూడణాలు కృష్ణగోదావరిజిల్లా రయితులపై పాటు కట్టుచుండవలసినదే. సెటిల్మెంటు ఆఫీసరు సిఫార్సుచేసిన అధికపన్ను న్యాయమా కాదాయని పూర్తిగా ఎన్నికసభ్యులేగల ఉపసంఘమువారు విచారించుటకు ప్రభుత్వమువా రంగీకరించుట కిదియే ప్రథమము. బార్డోలీలోవలె పన్నులనిరాకరింపబడి పెద్దఆందోళన గొప్పత్యాగము జరిగినపిదప గూడ ప్రభుత్వమువారు ఒకజడ్జి, ఒక రివెన్యూ ఉద్యోగి, ఒక అధికారేతరుడు గల మిశ్రమసంఘమును నియమించిరి. బ్రిటిషు ప్రభుత్వము ఇండియాలో స్థాపింపబడినపిదప యిట్టి విషయము విచారింప ఎన్నికసభ్యులకు విడచిపెట్టుటకు మదరాసు ప్రభుత్వమువారు మాత్రమే యీ నాడంగీకరించిరి. భూమిశిస్తు అధికముచేయు నూతన అమూదు నాలుగు జిల్లాలకు, ఒక యేడాదివరకే యుండునని అనుటకు వీలులేదు. పన్ను అధికముచేయుట శాశ్వతమగును.

గతవత్సరము యీ ఉపసంఘమువారు చేయుచున్న పనిబట్టి స్థానికప్రభుత్వమువారు రయితులవద్ద ప్రాతరేటు చొప్పున పన్ను వసూలు చేయవలెను, క్రొత్త రేట్ల చొప్పున వలదని తమ ఉద్యోగులకు ఉత్తరవు జేసినట్లు తెలియుచున్నది. ఇట్టిసమయమున యీ ఉపసంఘసభ్యులు సాధ్యమయినంతత్వరలో నివేదిక ముగించి సంతకములు చేసి రాజీనామాల నిచ్చుట న్యాయమగును. ఆంధ్రదేశములో ఏతావులందు శాసనోల్లంఘనము జరిపింపవచ్చునని యోచించుచున్నారు. ఇంకను ఏమియు నిర్ణయము కాలేదు.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘము వెంటనే సభజేసి కాంగ్రెసు కార్యక్రమము కొనసాగించుటగూర్చి చర్చించుననియు, రాజీనామాల నిచ్చిన శాసనసభ్యులందరును ఆ సభకు వత్తురనియు నమ్ముచున్నాను. (ఆ. ప్రె)

---

సుప్రసిద్ధ అపరాధపరిశోధకుడగు ఫ్రాంకు ప్రాయిష్టు గారు చనిపోయిరి.

# స్థానిక వార్తలు

ఆవడి ఆరోగ్యాశ్రమము — కోయంబత్తూరు తెలుగువారోద్ధుమండి రూ 25 విరాళము చేరినదనియు, దాని నికృతజ్ఞతతో నందుకొంటి మనియు, డా॥ లక్ష్మీపతి గారు ప్రకటించుచున్నారు.

---

రామకోగరావు యోగవ్యాయామకళాశాల:- టౌను అక్రహారము శాఖయొక్క ప్రథమవార్షికోత్సవము జనవరి 19 వ తేది ఆదివారం ఉదయం 7 నుండి రాత్రి 8 గం॥ లవరకు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి యాధ్యక్షతను జరుపబడును.

---

బెజవాడ, దక్షిణఇండియా ఛాంపియను షిప్పు పందెములు:— ఆంధ్ర జిమ్ఖానా గ్రౌండ్సులో జనవరి 11 వ తేదినుండి ప్రారంభమగును. టెన్నిసు, బాడ్మింటను, బిల్లియర్డుసు, పింగుపాంగు, ఫుట్ బాల్, మున్నగు పందెము లేగాక స్త్రీపందెములు, ఈతపందెములు గూడ జరుపబడును.

---

వైకుంఠ ఏకాదశినాడు ప్రత్యేక ట్రాము బండ్లు:— జనవరి 11వ తేదీన వైకుంఠ ఏకాదశి యుత్సవమును జూచుటకు తిరువళిక్కేణి శ్రీ పార్థసారథి స్వామి దేవాలయ గోపురద్వారమునకు ప్రజల సదుపాయము కొరకు ప్రత్యేక ట్రాము బండ్లు ఆ నాటి యుదయము 5-30గంటలకు బయలుదేరు నని ట్రాంవే కంపెనీవారు ప్రకటించుచున్నారు.

---

మద్రాసు జాతీయ వాలంటీరుదళ బహిరంగ సభ:— 9 వ తేది గురువారం సాయంకాలం 5-30 గంటలకు కోమలేశ్వరంపేట పెరుమాళుకోవెల సన్నిధియందు జరుగును. "స్వాతంత్ర్యము, 26 వ తేదిన యావద్భారత జాతీయప్రకాశోత్సవము" అను విషయముగూర్చి కాంగ్రెసు ప్రముఖు లుపన్యసింతురు.

---

దక్షిణ ఇండియా మహమ్మదీయ విద్యా సంఘము:— మద్రాసు విశ్వవిద్యాలయ సెనేటు సభకు యిద్దరు ప్రతినిధుల నెన్నుకొనుటకు పైసంఘముయొక్క సాధారణ సభ్యుల సమావేశము జనవరి 15వ తేదీ బుధవారం సాయంకాలం 5-15 గం॥ లకు మౌంటు రోడ్డులో లాలీహాలునందు జరుపబడును.

---

దక్షిణ భారత హిందీప్రచార సభవారి హిందీపరీక్ష:— పూర్వపు ప్రవేశ పరీక్షలోగాని లేక మధ్యమ పరీక్షలోగాని, కృతార్థులయిన వారు రాష్ట్రభాషా పరీక్షకు పోవచ్చును. పై రెంటిపరీక్షలలో దేనియందు గూడ కృతార్థులు కానివారు రాష్ట్రభాషాపరీక్షకు పోవలెనన్న ప్రత్యేక అనుమతి సంపాదించవలెను అని, పై సభయొక్క పరీక్షా మంత్రిగారు ప్రకటించుచున్నారు.

---

వితంతూద్వాహము

25-12-29 తేదీని, ఖరగపూరులో బి. యన్. ఆర్. ఆడిటాఫీసు (కలకత్తా) లో గుమాస్తాగనున్న యజ్ఞమిల్లి సూర్యనారాయణగారికిని శ్రీమతి పద్మనాభమునకును వేదవిధిగా వివాహము జరిగినది. ఈ వివాహమునకు ఊరిలోని పలువు రాంధ్రులును లేవిరర దేశస్థులును కూడా దయచేసిరి. వధూవరు లిరువురును బ్రాహ్మణులలో తెలగాణ్య శాఖకు జెందినవారు. వరునివయస్సు 26, వధువు వయస్సు 21.

పార్నంది రామచంద్రరావు.

---

నెల్లూరుజిల్లా కాంగ్రెస్ సంఘము

ఈ సంఘసమావేశము ఈ నెల 11 తేదినాడు సాయంకాలము, ఆంధ్రరాష్ట్ర శరభాసంఘ కార్యాలయందు ఇండియందు జరుగవలెననియు, లాహోరు కాంగ్రెస్ తీర్మానముల నమసరించి, పనిచేయుటకు, జిల్లా యందుగా మండపములందులకై వలయు ప్రయత్నముల చేయుటకు ఆవశ్యకమగునియు, సభ్యులందరు తప్పక రావలయుననియు, కార్యదర్శి శ్రీ బొమ్మ శేషరెడ్డి గారు ప్రకటించిరి.

(ప్రత్యేకవిలేఖరి)

రాకపోకలు:— శ్రీయుత ఎస్. సత్యమూర్తి గారు లాహోరునుండి గ్రాండుట్రంకు ఎక్స్ప్రెసు బండిమీద మొన్న సాయంకాలమున మద్రాసుకు తిరిగివచ్చిరి

జి. ఎస్. థోర్మాన్ ఐ. సి. ఎస్. గారు ఇంగ్లాండు నుండి నేడుదయము మద్రాసుకు తిరిగివచ్చిరి.

మద్రాసు సాల్వేషను ఆర్మీయొక్క నూతన టెరిటోరియలు కమాండరు అగు కర్నలు కార్లెజ్ గారు బొంబాయినుండి నేడుదయము మద్రాసుకు వచ్చిరి.

ఏ. ఆర్. కాక్సు ఐ. సి. ఎస్. గారు ఉదకమండలము నుండి నేడుదయము మద్రాసుకు వచ్చిరి.

హెచ్. ఎం. హూడుగారు నేడుదయము మద్రాసుకు తిరిగివచ్చిరి

సి. గోపాలమేనను (ఎం. ఎల్. సి.) దివాన్ బహద్దూర్ వి. మునుస్వామినాయుడుగార్లు, గతరాత్రి మద్రాసు విడిచి రాజమండ్రికిని, జి. టి. బోగ్, ఐ. సి. ఎస్. గారు బెజవాడకును, వెడలిరి.

---

## కార్పొరేషను నాగస్వరప్రదర్శనము

జనవరి నెలలో యీక్రింద వివరించబడిన స్థలములలో ఆయా తేదీల సాయంకాలములందు 5 గంటలకు జరుగును.

| స్థలము | వారము | తేది |
|---|---|---|
| పీపుల్సుపార్కు | ఆది | 19 |
| రాబిన్సను పార్కు | శుక్ర | 10 |
| శ్రీరాములు నాయుడు పార్కు (లోను స్క్వేరు) | శని | 25 |
| శివజ్ఞానం పార్కు | శుక్ర | 24 |
| వసంతమంటపం నారాయణముదలివీధి | మంగ | 21 |
| మైలాపూరు, వెంకటేశ్వరపురం | ఆది | 26 |
| | శని | 11, 18 |
| | గురు | 16 |
| నారాయణస్వామిశెట్టి లాన్, తిరువొత్తియూర్వీధి, రాయపేట | బుధ | 15 |
| మీర్సాహెబు పేట, కార్పొరేషను పాఠశాల | గురు | 23 |
| టౌనుస్క్వేర్, విక్టోరియారోడ్డు మంగంబాకం | ఆది | 12 |
| పరశురామముదలివీధి పార్కు | బుధ | 22 |
| అయ్యాస్వామిపిళ్లెపార్కు కోమలేశ్వరంపేట | గురు | 9 |
| వెంకటనారాయణపార్కు 17 వ డివిజను | సోమ | 13 |
| పానగలుపార్కు, మాంబళం | సోమ | 27 |
| ఎడ్వర్డుపార్కు కోటపేట | శుక్ర | 31 |
| శివమురుగపార్కు, చింతాద్రిపేట | గురు | 30 |
| ఎగ్మూరు రోసుస్క్వేరు కార్పొరేషను స్థలము | సోమ | 20 |
| నారాయణస్వామిశెట్టిపార్కు బళ్లాల, తేనాంపేట | బుధ | 29 |

---

## రామభోగరావు యోగవ్యాయామకళాశాల విద్యార్థుల వీరకళా ప్రదర్శనము

6-1-30 వ తేదీని భూతవ నగరాన "సెషిక్" పదవిని పంపాదించిన జనాబ్ అబ్దుల్ హకీమ్, సాహెబ్ బహదూర్ గారిని గౌరవించుటకు పౌరప్రముఖ మహాజనులు యుప్ప వి. స్థలమువరకు అఘుకిరిఘుర్మ్న యూర్యబురూ లులో చేసిన తోభవిందు పరఫర్యఘుళ ప్యాగాము ప్రస్థుత బులుపు రామభోగరావు యోగవ్యాయామకళాశాల విద్యార్థులు మహోత్సాహముగ వీరకళా ప్రదర్శనము గావించిరి.

ప్రారంభమున యన్, శేశపులు నాయుడు శరీరకండరములను చూపి ప్రేక్షకులకు మహదానందమును కలుగజేసెను.

| | |
|---|---|
| 2 వెంకట రంగము, 3 పుప్పులూరి సుందయ్యశాస్త్రి | కత్తిసాము - ప్రేక్షకుల మిగావేళ పరవశులైరి. |
| 4 నందగోపాలు | బొంగుల కసరత్తులు చేసి సభవారి మెప్పుపడసెను. |
| 5 రాజగోపాల్, 6 సుందయ్యశాస్త్రి ఉప్పులూరి | యోగాసనములు చేసి, నిజముగు యోగులను భలంపునకు తెచ్చిరి. |

ఇవన్నియు 20 నిమిషములలోనే లక్ష్యలాఘవ శుద్ధితో ప్రదర్శించి రామభోగరావు గారి కుటుంబము సార్థకపరచిరి

బెంగుళూరు అమెచ్యూరు నాటకసంఘము :— ఎగ్మూరు మ్యూజియం థియేటరునందు యీదిగువ వివరింపబడిన నాటకములను ప్రదర్శింతురు.

| | |
|---|---|
| 1 "ప్రహ్లాద" | 11 వ తేది శనివారం రాత్రి 9 గంటలకు |
| 2 "సుభద్ర" | 12 వ తేది ఆదివారం సాయంకాలం 5 గంటలకు |
| 3 "తప్పెవ్వరిది" (లేక "అభినవ సారంగధర") | 13 వ తేది సోమవారం సాయంకాలం 5 గంటలకు |

శ్రీయుత టి. రాఘవాచారి, శ్రీమతి సరోజనిదేవి, అన్నపూర్ణాదేవి గార్లు ముఖ్యపాత్రలను ధరింతురు.

---

## కార్మిక ప్రభుత్వము

### భారత దేశవిధానము

### మార్నింగుపోస్టు పత్రిక అధిక్షేపణ సాగుచునేయున్నది

(బీము సర్వీసు)

లండన్, జనవరి 7:— భారత దేశవిధానమునుగూర్చి కార్మిక ప్రభుత్వము అవలంబించుచున్న పద్ధతిని మార్నింగుపోస్టు పత్రిక ఆక్షేపించుచునే ఉన్నది. మహాత్మగాంధి, కరక్సింగు గార్ల బొమ్మలను ప్రకటించి కరక్సింగుగారు బహిరంగముగ ధైర్యముగా పోరాడువాడనియు, లోపలి స్వయంపాలనమనగా నలవాటుపడి రాజ్యవిధానములను, దీ-బ్రపద్ధతులను, కుట్రలను అవలంబించుననియు నడుపుచున్నది. ప్రభుత్వమువారు సిక్కులను జెందనాడుకొనుచున్నారు. ఇదిఅవకాశముచున్నది. ఎట్టి కాలిన ప్రవుమీద ఉప్పుపోసిన ఎటులుండునో రాండుకే బిజు సభ గూడ అంటించినట్టే ఉండునను వున్నది. శత్రువులకు భయమును కలుగజేయువారును మిత్రులలో నమ్మకమును బుట్టించువారను ముఖ్యముగ వ్యక్తులు గావలసియున్నారనుచున్నది.

---

## రోధరు మియరు ప్రభువు

### డెయిలీ హెరాల్డు పత్రిక ఖండనము

(బీము సర్వీసు)

లండన్, జనవరి 7:— 'డెయిలీ హెరాల్డు' "మనకిచ్చిన మాటలు" అను శీర్షికతో ఇట్లు రోధర్మియరు ప్రభుని ఖండించుచు వ్రాయుచున్నది:— ఇండియాలో మనవినాశమును మనమే తెచ్చి పెట్టుకొనుచున్నామని డెయిలీ మెయిలు పత్రికలో రోధర్మియరు ప్రభువు ప్రకటించిన విషయము నీచముగా నున్నది. గాంధిగారిపై నీచపు వ్రాతలను వ్రాసెను. దీనివలన చెప్పరాని హాని వాటిల్లును.

ఈ వ్యాసములోనే ఒక విశిష్టవ్యక్తి గాంధిగారు ఉక్త, మానవుడనియు, వీరికి ప్రభుత్వము సదా ధన్యవాదములర్పించవలెను కల్లవిషయమే తెల్లవిషయము పాలనకు కాలం ఇచ్చినాడని అన్నటుల పర్ సైకలు ఓక్వయత్ గారు వ్రాయుచున్నారు

---

## బ్రిటిషు పరిపాలనము

### హిందువుల ప్రాతికూల్యము" మెస్టన్ ప్రభువు

(బీము సర్వీసు)

లండన్, జన 7 — సండేక్రానికల్ పత్రికలో మెస్టను ప్రభువు ఇట్లు వ్రాయుచున్నాడు — బ్రిటిషు పాలనమునకు హిందువులు ప్రతికూలురగుచు ఇండియాలో పనిచేయు అధికారులకు చెయూత నొసగవలెను. దేశములో రక్షణయును సభాగ్రముగ నేర్పరచిరి భయపడ నక్కర లేదు

---

# విదేశవార్తలు

## అయ్యవారేమిచేస్తున్నారయ్యా అంటే తప్పులను జేసి దిద్దుకొనుచున్నారన్నట్టులున్నది

రస్సెలుప్రభువు భారతదేశమునకు డొమినియను ప్రభుత్వము నివ్వుటలేదనలేదట

(రూటరు)

లండన్, జనవరి 7 —క్యాంబ్రిడ్జిషైరులో కార్మికపక్ష సభయందు జనవరి 4 తేదీని ఇండియాకు డొమినియను ప్రభుత్వము ఇవ్వుటలేదని రస్సెలుప్రభువు చెప్పెనని రూటరు ప్రకటించెను. రస్సెలుప్రభువు తిరిగి లండనుకు వచ్చినపుడు రూటరు ఆయనను ప్రశ్నింపగా తాను ఇండియావిషయమై ఉపన్యసించినది వాస్తవమేగాని తాను ఇండియాకు డొమినియను ప్రభుత్వమును ఇప్పుడుగాదుగదా, చాలకాలమువరకుకూడ ఇవ్వరన్న సంగతులను పలికి లేదనియు అప్రకారము తెలుపవలెననియు రస్సెలుప్రభువు ప్రశ్నోత్తరమిడెను ఇంతకంటె చర్చింప నిరాకరించెను.

## వంతెన కూలుట

(రూటరు)

లండన్, జన 7 — గలేమాడగ్గర ట్యూనిసుజిల్లకు ఎక్స్‌ప్రెస్ రైలు పోవుచుండ కూలెననియు, ఒకయింజను, నిండుగానున్న రెండు బండ్లు ఒక మెయిలుతపాలబండియు కాల్వలో పడెను. 12 గురు చనిపోయిరి. 20 మంది క్షతగాత్రులైరి

## జాతిసమితి సభ

(వైర్లెస్)

రుగ్బీ, జనవరి 7 — జినీవాలో రాబోవు సోమవారము జరుగు జాతిసమితిసభకు గ్రేటుబ్రిటను ప్రతినిధిగ బ్రిటీషు విదేశాంగమంత్రి హెండర్సనుగారు వచ్చే శుక్రవారము బయలుదేరెదరు జాతిసమితి ఒడంబడికసూత్రములలో యుద్ధమును పూర్తిగ బహిష్కరింపవలెనను సూత్రములు లేవుగాన ఆసూత్రములు కెల్లాగు ఒడంబడికతో సరిగా నుండునటుల సవరణ చేయు విషయమును ఆలోచించెదరు. ఈసవరణనుగూర్చి ఎంతవరకు ఆవసరమో తెలుపుటకు 11 గురితో ఒకసంఘమును నియమించెదరు. రెండుసంవత్సరములవరకు అంతర్జాతీయ న్యాయస్థానమును హెచ్చుచేయుటకు జరుపవలెను విషయమును ఆలోచించెదరు. ఈవిషయమై 1929 లో ప్రభుత్వముల వారు తమయభిప్రాయములను తెలుపవలెననిరి అప్రత్యుత్తరములనుబట్టి ఈవిషయమై సభ సెంట్రలుగ నెలకొల్పవలెనో ఆలోచించెదరు కాశ్మీరు మ్యాండేటు విచారణసంఘమువారి నివేదికను చర్చించెదరు. ఇరాకు, ట్యానుయాఫ్రికాలో నున్న బ్రిటిషు మ్యాండేటును గూర్చియు, పడమటి ఆఫ్రికాలో మ్యాండేటు నిర్ణయించు గూర్చియు చర్చించెదరు. జెరూసలములో యూదులు, ముసల్మానుల తగవులను పరిష్కరించుటకు రక్షణ మొకసంఘమును నియమించుటనుగూర్చి మ్యాండేటు కమిషనువారు తమ యభిప్రాయమును తెలిపిరి

---

ఈ మాసమున లండనులో జరుగు నౌకా నిర్ణయసభను పరిగణించుటకు పరిస్థితులు అనుకూలముగ నున్నచో జపాను అంగీకరించును.

---

[1] బ్రిటీషు వైమానికమంత్రి క్యారోకు పోవుచుండగా వర్షించుచుండుచే క్రిందకు దిగవలసివచ్చెను.

---

ఇండియా కార్యాలయమున సైనిక కార్యదర్శిగ సర్ అలగ్జాండరుకాబగారు నియమింపబడిరి

## నౌకాదళ నిర్ణయసభ

అమెరికను రాయబారుల పయనము

ప్రెసిడెంటు హూవరుగారి సందేశము

(రూటరు)

వాషింగ్టన్, జనవరి 7 —న్యూయార్కునుండి ఇంగ్లండుకు నౌకాదళనిర్ణయసభకు ప్రతినిధులుగ వెడలిన అమెరికను రాయబారులకు కిల్లాగ్సువుచు, ఓమినర్తోను, ఉత్సాహముతోను అవశ్యకముగ విమర్శించి సభ జయప్రదమగుటకు అమెరికను ప్రతినిధులు తోడ్పడెదరు గాక యని ప్రెసిడెంటు హూవరుగారు ఆశీర్వదించి పంపిరి. ఈపనుస్థితి చిక్కులతో గూడుకొన్నది. త్వరలో ఫలితము లేర్పడవు మూడునాలుగు నెలలలో సభ పూర్తియగుటే గొప్పకార్యము గుదిరి.

## బ్రిటనులో పనిలేనివారి సంఖ్య

(వైర్లెస్)

రుగ్బీ, జనవరి 7 —డిశంబరు 30 తేదీకి పనిలేనివారిసంఖ్య 1510200 గలదు. డిశంబరు 16 తేదికంటె 206843 మంది ఎక్కువ. క్రిస్మసువర్తకములో పనిచేయువారిని తొలగించుట చేతను కొద్దికాలమే పనిచేయుట ఏర్పడుటచేతను పనిలేనివారి సంఖ్య ఎక్కువయినది. 1929 చివరకు పనిలేనివారి మొత్తపు సంఖ్య 1928 చివరనున్న సంఖ్యకంటె 10530 మంది తక్కువ. ఉత్తరజిల్లాలలో ఉన్ని మరియితర నేత పరిశ్రమలలో వేతనముల తగవులుగూర్చి విచారించి తీర్మానించుటకు హ్యూమ్యాక్‌మిలనుగారిని నియమించిరి

## రాబోవు నౌకాదళ నిర్ణయసభ

టైమ్సుపత్రిక

(వైర్లెస్)

రుగ్బీ, జనవరి 7 —నౌకల సైజును మరింత తగ్గించిన క్రియారూపమగు సాధన మేర్పడగలదని టైమ్సుపత్రిక తెలుపుచున్నది

## ఆఫ్ఘను పరిస్థితులు

ఇండియాకు రషియా భయము

సర్ హ్యామిల్టనుగారి ప్రకటన

(రూటరు)

లండన్, జన 7 —ఆఫ్ఘను పరిస్థితులనుగూర్చి రాయలు ఎంపైరు సొసైటీలో ఉపన్యసించుచు సర్ హ్యామిల్టను గ్రాంటుగారిట్లు తెలిపిరి —ఇండియాకు రషియా యుపద్రవము అంతరించినది. సోవియటుల ప్రచారమును సాగనిచ్చిన తమ జాతికి వినాశకరముగ నేర్పడునని ఆఫ్ఘనులు గ్రహించిరి

భారతీయులు, స్వాతంత్ర్యము

భారతదేశ రక్షణమును ఏమాత్రము గ్రహింపనున్న వీరులకు ఆఫ్ఘను తెగలవారు ఇండియాపై పడుటకు సిద్ధముగా నున్నందున ఆ ప్రమాదమును గూర్చి గ్రహింపవలెను. బ్రిటిషు ప్రభుత్వసహాయము లేనిచో దేశము కూలిపోవును. పెషావరు, కలకత్తాల మధ్య ఒక అవివాహిత పడుచుగాని రూపాయిగాని దక్కదని ప్రతాపసింహుగారన్నటుల జరుగును.

సరిహద్దు సంరక్షణము సరిహద్దు తెగలమీదనే ఆధారపడియున్నది. పరాయి తమ దేశరక్షణమునకు జాతిసమితిమీద ఆధారపడరని సర్ తేజబహదూరు సప్రూగారనిరి.

సరిహద్దును గాపాడిన రాజకీయోద్యోగులకును సైనికులకును సామ్రాజ్యము ఎంతయో కృతజ్ఞతను జూపవలసియున్నది సదా తమని రెడుక్రొను యుపక్రమమును చేయలేవు. భారతదేశమునకు ఆ ఉపద్రవము తొలగలేదు. సరిహద్దుపరిస్థితులను గూర్చి ఏమియు తెలియకపోవుటచే "లాహోరులో అట్ట ప్రలాపములను" గావించిరని సర్ హారోగ్రస్టుబుల్లోకుగారనిరి

సరిహద్దుకు సైనికులుగాపాడు, క్రైస్తవ ఆస్పత్రులు స్నేహముచే దానిని వశపరచుకొనెను. ఉపయోగించిన సామ్రాజ్యమునకు సేవచేయుచున్నారని అందరు హిల్లు అనునాయన తెలిపెను.

## హేగు నష్టపరిహారసభ

[వైర్లెస్]

రుగ్బీ, జనవరి 7 —యంగువిధానముప్రకారము జర్మను చెల్లింపవలసిన సొమ్మును ఏ తేదీనుండి వసూలుచేయవలెనని నిర్ణయించిరి ప్రతినెల 15 తేది చెల్లించవలెనని ఋణదాత లనగా జర్మనీ ప్రతినిధులు ఆక్షేపించిరి. ప్రతి నెలాఖరున నివ్వవలెనని తెలిపిరి త్వరగా ఇచ్చుటచే తమకు నష్టమని జర్మనులు తెలిపిరి. కాని ప్యారిసు నిపుణులు 15 తేదిని నిర్ణయించిరని ఋణదాతలనిరి జర్మనులవాదము నంగీకరించుచో ఋణదాతలకు వడ్డీ నష్టము వచ్చునని. ఈ విషయమును విపులముగ ఆలోచించుటకు గడువీయవలెనని జర్మను ప్రతినిధులడిగిరి. వచ్చే మంగళవారము జరుగును ఒకవేళ జర్మనులు ఆప్రకారము ఇవ్వనిచో దానిని వసూలుచేయుటకు అధికారమును, సాధనములను ఏర్పాటుచేయవలెనని అది అనవసరమని బ్రిటిష్‌ప్రతినిధి తెలిపెను. మధ్యాహ్నము ఈ విషయమును గ్రహించి జర్మను ప్రతినిధులు ఆలోచించిరి. తమ యభిప్రాయమును గ్రహించివారు నేడు తెలిపెదరు.

## వాతావరణస్థితి

1930 సం॥ జనవరి నెల 7-వ తేది మంగళవారము

| ముఖ్యస్థలములు | గత 24 గంటలలో అత్యధిక ఉష్ణము | గత 24 గంటలలో అత్యల్ప ఉష్ణము | గత 24 గంటలలో వర్షము | జనవరి 1-వ తేదీనుండి వర్షము | సాధారణముకన్న హెచ్చుతగ్గు |
|---|---|---|---|---|---|
| గోపాల్‌పూర్ | 83 | 68 | ... | | |
| విశాఖపట్టణము | 80 | 69 | ... | 0 | — 0 1 |
| కాకినాడ | 80 | 67 | ... | 0 | — 0 1 |
| మచిలీపట్టణము | 81 | 68 | ... | 0 | — 0 1 |
| కర్నూలు | 89 | 68 | ... | 0 | 0 |
| బళ్లారి | 85 | 68 | ... | 0 | — 0 1 |
| అనంతపూర్ | ... | ... | ... | 0 | 0 |
| కడప | 83 | 71 | 0 1 | 0 1 | — 0 1 |
| నెల్లూరు | 81 | 74 | 0 1 | 0 1 | — 0 6 |
| మద్రాసు | 81 | 73 | 0 1 | 1 5 | + 1 0 |
| కడలూరు | 77 | 72 | 4 9 | 8 2 | + 7 6 |
| వెల్లూరు | 79 | 70 | 0 1 | 0 2 | — 0 7 |
| సేలము | 85 | 69 | † | 0 | — 0 1 |
| కోయంబత్తూరు | 88 | 69 | 0 1 | 0 1 | — 0 2 |
| తిరుచునాపల్లి | 82 | 70 | 0 4 | 0 5 | + 0 2 |
| నాగపట్టణము | 77 | 72 | 8 8 | 11 5 | + 10 9 |
| మధుర | 85 | 72 | ... | 0.1 | — 0 1 |
| పాంబన్ | 78 | 73 | 0 4 | 8.8 | + 2 6 |
| పాలంకోట | ... | ... | ... | 0 | — 0 5 |
| తిరువేంద్రము | 85 | 77 | ... | 0 | — 0 2 |
| కొచ్చిన్ | 89 | 76 | 0 2 | 0 8 | 0 |
| కాలికట్టు | 92 | 75 | ... | 0 | — 0 1 |
| మంగుళూరు | 93 | 75 | ... | 0 | 0 |
| బెంగుళూరు | 72 | 65 | 0 1 | 0 1 | + 0 1 |
| మర్కార | 75 | 61 | ... | 0 | 0 |
| కొడైకెనాల్ | 60 | 51 | 0 7 | 0 9 | — 0 8 |
| కూనూర్ | 68 | 51 | 0.2 | 0 3 | |

ఉత్తరభాగములు:—ఆకాశము నిర్మలముగ నున్నది. శీతోష్ణస్థితి మామూలుగ నున్నది.

దక్కన్:—కడపలో 0 1 వర్షించెను. కడపలో పగటివేడిమి 4 డిగ్రీలు తక్కువ రాత్రివేడిమి ప్రదేశమున 1 మొదలు 9 డిగ్రీలు ఎక్కువ.

కర్నాటకము:—కడలూరులో ఎన్నడులేని రీతిగ 4 9 వర్షించెను. మద్రాసు, నెల్లూరులలో చినుకలు పడెను. పగటివేడిమి 3 మొదలు 6 డిగ్రీలు తక్కువ. రాత్రివేడిమి 3 మొదలు 8 డిగ్రీలు ఎక్కువ

ఎ. ఎ. నారాయణయ్యరు,
సహాయ వాతావరణ శాస్త్రజ్ఞుడు.

## మదరాసు రాష్ట్రీయ కేంద్ర భూమితనఖాబ్యాంకు

మదరాసు రాష్ట్రీయ కేంద్రతనఖా బ్యాంకు డైరెక్టర్ల సమావేశము 8 వ తేదీ ఉదయం 9 గంటలకు చీఫాఫీసునందు రిజిష్ట్రారుగారి శ్రీహస్తములో జరిగినది.

సభకు హాజరైనవారు — 1 మోచర్ల రామచంద్రరావు పంతులుగారు 2 వేమవరపు రామదాసుపంతులుగారు 3 నరసింహదేవర సత్యనారాయణగారు 4 గోపాలస్వామినాయక్ గారు 5 కుప్పల్లె వెంకటరత్నంపంతులుగారు 6 కోఆపరేటివు రిజిష్ట్రారుగారు 7 అన్నా దొరస్వామిగారు

బ్యాంకు అధ్యక్షులగు స్వామికానంగారు చనిపోయినందున వారు బ్యాంకికిని సహకారోద్యమమునకు చేసిన సేవవిషయమై ప్రశంసించుచు వారి కుటుంబమునకు సానుభూతి తీర్మానము కావించిరి.

డాక్టరు స్వామికానంగారు చనిపోవుటచే వారు బ్యాంకు అధ్యక్షులుగా నుండినందున, శాశ్వతముగా బ్యాంకు డైరెక్టరులలో నొకరిని ఎన్నుకొనవలసి వచ్చినది. ఇదివరలో ఉపాధ్యక్షులుగా నుండిన దివాన్‌బహద్దరు మోచర్ల రామచంద్రరావుపంతులుగారిని అధ్యక్షులుగా ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి. గోపాలస్వామినాయక్‌గారు కోశాధిపతిగా ఎన్నుకోబడిరి. ఉపాధ్యక్ష పదవి ఖాళీ అగుటచే ముందు సభలో ఉపాధ్యక్షుని ఎన్నిక జరుపుటకు నిర్ణయింపబడినది. బ్యాంకు నూతనముగా స్థాపించుటచే తగిన ద్రవ్యము [illegible] నియామకము ప్రస్తుతము నిలిపివేయబడినది. స్థానిక భూమితనఖాబ్యాంకులకు అప్పులు మంజూరుచేయుటకు తగు ఏర్పాటు చేయుటకు నిబంధనలు వ్రాయబడినవి. బ్యాంకునకు ప్రత్యేకగృహము ఏర్పాటుచేయుట విషయమై అధ్యక్షునకు అధికారమీయబడినది. బ్యాంకునకు వెంటనే 50 వేల రూపాయిల షేరుధనము కావలసియున్నది. కుంటుకొరకు ప్రజలకు తెలియజేయుటకు హిందూ, స్వరాజ్య, మెయిలు, ఆంధ్రపత్రిక, జస్టిసు, స్వదేశమిత్రను పత్రికలలో ప్రకటించుటకు తీర్మానింపబడినది. ప్రస్తుతము వ్యక్తులకు 5 షేర్లుకంటె అధికము యీయబడదు. షేరు నూరురూపాయిల విలువయందును చాలమంది వ్యక్తిసభ్యులు బ్యాంకుస్వనకార నియమములలో పాల్గొనుటకు హెచ్చుషేర్లు యీయకుండుటకు యుక్తి నిబంధన చేయబడినది. తెలుగుజిల్లాలవారు యీ తరుణము పోగొట్టుకొనక హెచ్చుమంది బ్యాంకులో వాటాలుతీయుట మంచిది. (స్వకీయవిలేఖరి)

# శ్రీ అరవిందయోగి మరల నాయకత్వము వహించునా?

## పుదుచ్చేరిలోని ఆశ్రమ విశేషములు

శ్రీ అరవింద ఘోషుగారి సోదరుడగు శ్రీయుత వీరేంద్రకుమార ఘోషుగారు పుదుచ్చేరి ఆశ్రమములో పెక్కు సంవత్సరములనుండి నివసించుచున్నారు. వారిటీవల కలకత్తాకు వచ్చినపుడు లిబర్టీ పత్రికావిలేఖరి వారిని సందర్శించి, యీ దిగువ వివరింపబడిన విషయములను వారివలన తెలిసికొని లిబర్టీ పత్రికాముఖమున ప్రకటించెను.

## అరవిందయోగి శిష్యుల కొసగిన సందేశము

"భగవంతునకు సమగ్రమగు నాత్మసమర్పణము గావించెడు భక్తులకే భగవంతుడు వశుడగును. పరమశాంతి, దివ్యతేజము, దివ్యశక్తి, దివ్యసౌఖ్యము, బంధవిముక్తి, విశాలభావము, పరిపూర్ణజ్ఞానము, దివ్యానందము మున్నగున వన్నియును వారికే లభించును."

శ్రీయుత వీరేంద్ర కుమార ఘోషుగారు ఆరేండ్లనుండి తపశ్చర్య నొనరించుచున్నారు. బహిఃప్రపంచమును పూర్తిగా త్యజించి వీరంతర్ముఖులై యున్నారు. వారు శిరోజములను దీర్ఘముగా పెంచిరి. వార్ధక్య సూచకమగు పలితవర్ణము గూడ శిరోజములం దచట నచట గోచరించుచున్నవి. వారి నేత్రములు నూతన తేజోవిరాజితములై యున్నవి. వారివాణి ప్రశాంతరమణీయమై యున్నది.

### ఆశ్రమవాసము

"పుదుచ్చేరి ఆశ్రమమునం దిపుడు 85 మంది నివసించుచున్నారు. ప్రతి సంవత్సరమును వివిధదేశముల నుండి చాలమంది వచ్చుచుందురు. వీరు నివసించుటకు 19 యిండ్లు యేర్పరుపబడెను. వానిలో చాల భాగము అద్దెకు పుచ్చుకొన బడినవే. అరవిందయోగి నివసించు ప్రధానగృహమునకు కడు చేరువగనే యీ యిండ్లన్నియు నున్నవి. ప్రతి సాధకునకును ప్రత్యేకముగా నొకగది యియ్యబడును. ఆగదిలో వాడు తనకు తగిన విధముగ తపశ్చర్య నొనరించుటకు యథాశక్తిని ప్రయత్నించుచుండును. ఈ ఆశ్రమమునకు మీరాదేవియే క్రియాశక్తి యనదగును. ఆమె నందరును అమ్మ అనియే పిలుచుచుందురు. ఆశ్రమ నిర్వహణ మంతయును ఆమె ఆధీనమునందే యున్నది. యోగసాధనలోగూడ నామె సాధకులకు ఉపదేశ మొనగించుచుండును. క్రొత్తగా ఆశ్రమమునకు రాగానే ప్రతివ్యక్తియును తన భౌతికసంపద నంతను ఆశ్రమమునకు సమర్పించును. అది ప్రజోపయోగనిధికి చేర్పబడును. ఆశ్రమమునందున్న వారి కందరికిని కావలసిన సదుపాయముల నన్నిటిని మీరాదేవియే సమకూర్చుచుండును. ఆశ్రమనిర్వహణమునకు సాధకు లిట్టుల సమర్పించెడు ధనమే మూలాధారము. గృహస్థ ధర్మమాశ్రయించినవారు మరికొందరుగూడ ఆశ్రమముతో సంబంధమును కలిగియున్నారు. వారు ఆలుబిడ్డలతో స్వగృహములందె నివసించుచు వుద్యోగములు మున్నగు వృత్తులను నెరవేర్చుకొనుచునే యుందురు. తమ ఆదాయమున కొంతభాగము ఆశ్రమమున కొసగుచుందురు. అప్పుడప్పుడు ఆశ్రమమునకు వచ్చి స్వల్పకాల ముండిపోవుచుందురు. ఆశ్రమము పరాపేక్ష లేకుండ నిర్వహింపబడుటకు తగిన యేర్పాటులుగూడ జరుగుచున్నవి. గ్రంథాలయము నానాటికి పెరుగుచున్నది. సామగ్రుల కాళ్ళయును రొట్టెలను చేయుశాలయును (చాకరీ) కూడగలవు. ఆశ్రమవాసులందరును కలసియే వీనిని కొనసాగించుచుందురు.

### నిత్యకృత్యములు

ఆశ్రమవాసులందరును ఉదయమున శీఘ్రముగనే మేల్కాంచి స్నానముచేసి పుష్పములను గైకొని మాతృ (మీరాదేవి) సందర్శనమునకేగి ఆమె ఆశీర్వాదమును బడయుదురు. పిమ్మట సాధకులందరును తమతమ గదులలోనికిపోయి వారి వారి యిచ్చానుసారము సాధనచేయుచుందురు. గ్రంథావలోకనము చిత్రలేఖనము గానపరిశ్రమ మున్నగునవి గూడ యోగసాధనకు సహాయకములే గాని నిరోధకములు కావని అంగీకరింపబడెను. భోజనసమయములందు మాత్రమే ఆశ్రమవాసులలో చాలమంది భోజనశాలలో సమావేశమయ్యెదరు గాని తక్కిన వేళలలో వేరువేరుగానే యుందురు. అందరితోనుకలసి భుజించుట కిష్టములేనివారికి వారి గదులలోనికే ఆహారపదార్థములు పంపబడును. ఆశ్రమమునందు సాధన చక్కగా జరుగుటకు ముఖ్యావసరము, ప్రశాంతస్థితి భంగము కలుగకుండుటకు తగిన యేర్పాటు లన్నియును చేయబడెను. సాధనవలన దివ్యజీవితమును బడసి దానిసత్యమును లోకమునకె వెల్లడించుటయే ఆశ్రమముయొక్క ప్రధానాశయము. తక్కిన వన్నియు అప్రధానములే. తక్కిన యేర్పాటులనుండి సంఘముయొక్క ఆవశ్యకతలు పెరుగుటను బట్టియే యుండును గాన ఆ వస్తువులు క్రమక్రమముగానే పెరుగుచుండును.

### ప్రధానాకర్షణము

ఆశ్రమమునం దిపుడు భారతదేశమునందలి అన్నిరాష్ట్రములవారును గూడ నున్నారు. కాని వంగ, గుర్జర రాష్ట్రములవారే మిక్కిలి హెచ్చుగా నున్నారు. మహారాష్ట్రులుమాత్ర మొకరైనను లేరు. వారు ప్రపంచజీవితమునందే నిమగ్నులై యుండుటచే కఠినతపశ్చర్య వారిమనస్థితికనుకూలింపదని తోచుచున్నది. ఆశ్రమములో ఏడుగురు మహమ్మదీయులుగూడ నున్నారు. వారిలో నలుగురు స్త్రీలును, ముగ్గురు పురుషులును కలరు. వీరందరు హైదరాబాదువారే అని చెప్పవచ్చును. వంగరాష్ట్ర గ్రంథకర్తలలో సుప్రసిద్ధులగు శ్రీయుత సురేశచంద్రచక్రవర్తి, శ్రీయుత నళినీకాంతగుప్తగార్లును కొన్నియేండ్లక్రితము రాజకీయములందు నాయకత్వమును వహించియుండిన శ్రీయుత అనిలాభరణరాయిగారును అతని సోదరియునుగూడ ఆశ్రమమునందున్నారు. గానకళాకోవిదుడగు శ్రీయుత దిలీపకుమార రాయిగారును గానమాధుర్యమునకు కలకత్తాలో విఖ్యాతురాలైన శ్రీమతి సహానాదేవియును యిటీవలనే ఆశ్రమమున ప్రవేశించిరి. దిలీపకుమారరాయిగారిపుడు ఆశ్రమవాసమునందే దీక్షితులుగానుండుటచే అతడు మరల లోకప్రవృత్తమున పాల్గొనుట కట్టి అవకాశమును కనబడదు. ఇటీవల ఆంధ్ర విశ్వవిద్యాలయమున ఉపాధ్యాయునుగానుండిన ప్రొ॥ వస్వానిగారుగూడ ఇటీవలనే ఆశ్రమమునకు వచ్చిరి. అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశములవారు మరికొందరుగూడ ఆశ్రమమునం దున్నారు. తగినధనము సమకూడినచో ఆశ్రమావకాశమును అధికముగా విస్తరింప జేయవలెనను సంకల్పము కూడ గలదు.

### ఏకాంతసాధన

కార్యనిర్వహణాధికారము మీరాదేవియందే యుండినను సర్వకార్యములును శ్రీ అరవిందయోగి అనుమతితోనే జరుపబడుచుండును. అరవిందయోగి నిరంతరమును తన కేర్పరుపబడిన గదులలోనే ఏకాంతసాధన నొనరించుచుండును. ఏటకు మూడుసారులు మాత్రమే యీవలకువచ్చును. మీరాదేవి వర్ధంతిదినమగు ఫిబ్రవరి 21 వ తేదీని అరవిందయోగి వర్ధంతిదినమగు ఆగస్టు 15 వ తేదీని అరవిందయోగి యోగసిద్ధిని బడసిన నవంబరు 24 వ తేదీని మాత్రమే ఆశ్రమవాసులందరును కులపతిని సందర్శింపగలుగుదురు. అప్పుడైనను వారితో నతడేమియును సంభాషింపడు. సామాన్యముగా ఆశ్రమవాసులు కానివారి కప్పుడుగూడ నతడు దర్శనమియ్యడు గాని ఆదివర కనుమతిని బడసియున్నచో ఆశ్రమవాసులు కానివారికిగూడ నా మూడుతడవలలోను అతని దర్శనము లభించును.

### శ్రీ అరవిందయోగి భావివిధానము

"మరికొన్నియేండ్లకు నేను మరల లోకతంత్రమున ప్రవేశించెద" నని కొన్నియేండ్లకు పూర్వము అరవిందయోగి వ్రాసినలేఖ అపుడు ప్రచారమునం దున్న 'నారాయణ' అను పత్రికలో ప్రకటింపబడినమాట నిజమేగాని యిపుడాతని అభిప్రాయమంతయు పూర్తిగా మారిపోయినది. ఆత్మానుసంధానము అధికమగుచున్న కొలదిని వెనుకటి అభిప్రాయము లన్నియును మారిపోవుచున్నవి. వెనుక నేను వెల్లడించిన భావములనుగూర్చి యిపుడు తలపెట్టకుడు." అని ఒకసారి అరవిందయోగియే నుడివెను.

### దివ్యసత్యాన్వేషణము

దివ్య సత్యమును సందర్శించి దాని నలవరచుకొని దానిని ప్రపంచమునకు వెల్లడించుటకే అరవిందయోగి యిట్టి కఠినతమమగు సాధన యొనరించుచున్నాడు. అతడందు కృతార్థుడైనచో మానవసంఘమునందలి దివ్యాత్మ నూతనావతారమునే ధరింపగలదు. అందువలన మానవసంఘమున దివ్యజ్ఞానమును దివ్యశక్తియును ప్రపూర్ణమగుటచే నూతనస్థైర్యముగూడ చేకూరును. అందువలన నూతనజన్మ లేక నూతనపరివర్తనము సిద్ధింపగలదు. అందరును భావించుచుండునట్లు శ్రీ అరవిందయోగి మరల సాంఘిక రాజకీయోద్యమములను స్వయముగా నడుపుటకు ప్రజామధ్యమునకు రాకపోయినను అరవిందయోగికి సిద్ధించిన దివ్యసత్యము నతడు లోకమునకు వెల్లడింపగలిగినయెడలను, దానిని మానవసంఘము నిత్యజీవితమునందు కొనసాగింపగలిగినయెడలను అతడు స్వయముగా నాయకత్వము వహించుటవలన కలిగెడులాభముకంటె నూరురెట్లధికమగు ప్రయోజనమే కలుగును. ఇది సర్వకాలములందును ఇటులే జరుగుచుండెను. ప్రపంచమున నూతనశకమును నూతన విజ్ఞానమును వ్యాపింపవలసినపుడెల్ల బుద్ధుని క్రీస్తును పోలినమహనీయు లవతరించుచునే యుందురు. అట్టి అవతారపురుషులే నూతనవిజ్ఞానమును ప్రపంచమున వ్యాపింపజేయుచుందురు.

అప్పుడప్పుడు ముఖ్యముగా పైన వివరింపబడిన మూడు ముఖ్యసమయములందును అరవిందయోగి తన సందేశములను వ్రాసి ఆశ్రమవాసులకందరికిని పంపుచుండును. అరవిందయోగి, కడపటి వర్ధంతి రోజున ఆతడిట్టుల పంపినసందేశమే ఈ వ్యాసమునకు అగ్రభాగమున ప్రకటింపబడెను. అని వరేంద్ర కుమారఘోషుగారు తెలిపిరి. (లిబర్టీ-కలకత్తా)

# సర్ కే. వీ. రెడ్డినాయుడుగారి యారోగ్యస్థితి

## సుఖముగా నుండుట

చెన్నపురి, జన 8:— సర్ కే. వీ. రెడ్డి నాయుడుగారి యారోగ్యము అభివృద్ధినొందినది. శ్రీ రెడ్డినాయుడుగారు ఉత్తర ప్రత్యుత్తరములకు సంబంధించిన వ్యవహారమంతయు తామే స్వయముగా చూచుకొనుచున్నారు.

# కృష్ణాజిల్లా ప్రాసెస్ సర్వర్లసంఘ ప్రథమ సమావేశము, బెజవాడ

(స్వకీయవిలేఖరి)

బెజవాడ, డిసెం 23:—నిన్న సాయంత్రం 2 గంటలకు యీ పట్టణమున నున్న మ్యూనిసిపలు హాలునందు యీ జిల్లాలోని ప్రాసెస్‌సర్వర్ల కాన్ఫరెన్సు జరిగినది. దాదాపు 300 మంది ప్రతినిధులు సభకు విచ్చేసిరి. సభయందలి అభిమానమును ప్రచురించుటకై ప్రముఖులనేకులు గలరు. అట్టివారిలో కొందరి నామములను దుదహరించుచున్నాము. బెజవాడ పురపాలక సంఘాధ్యక్షులును మద్రాసు శాసనసభ్యులును అగు శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, కృష్ణాజిల్లా జడ్జిగారు, కర్నూలుజిల్లా జడ్జిగారు, కర్నూలు, బెజవాడ సబు జడ్జీలు, బెజవాడ కోర్టుమునసబు మున్నగువారు సభ జయప్రదముగ జరుగవలయునని కోరుచు, ఉపన్యాసముల నంపిరి, నెల్లూరు, సేలం, ఒట్టపాలెం, బందరు, తిరునల్వేలి మున్నగు ప్రదేశములనుండి సందేశములు పంపబడెను.

సభకు శ్రీయుత దాసు త్రివిక్రమరావుపంతులు బార్-అట్-లా గారు అధ్యక్షత వహించిరి.

సభ దైవప్రార్థనలతో ప్రారంభ మయ్యెను. పిమ్మట ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీయుత పొక్కునూరి పూర్ణానంద శాస్త్రులుగారు తమయుపన్యాసమును చదివిరి. అందులో నిట్లుసదహరించిరి "ప్రాసెస్ సర్వర్లకు అనేక యేండ్లక్రిందట నిర్ణయించిన స్వల్పవేతనమే నేటికిని హెచ్చుసేక అట్లునే యున్నది. ఇప్పుడు అన్నివస్తువుల ధరలు విపరీతముగ హెచ్చినందున ఇట్టిస్వల్పవేతనముతో భార్యాపుత్రాదులను యీ కరువు దినములలో పోషించుకొనుట దుస్తరమై న్యాయముగా పాలించుటకు యీ ప్రాసెసు సర్వర్లు అసమర్థులగుచున్నారు. కాబట్టి వీరి జీతములు వృద్ధిచేయబడవలయును ఇందులకై సరియైన మార్గమును ప్రభుత్వమువారికి మనవిచేయవలసియున్నది ఏకగ్రీవముగ మనవిచేయుదుమేని ప్రభుత్వమువారు తప్పక మన కోర్కెలను తీర్చగలరు.

పిమ్మట అధ్యక్షులవారు తమ యుపన్యాసమును చదివిరి ఈ క్రింది తీర్మానములు యేకగ్రీవముగ సభవారిచే ఆమోదింపబడినవి.

తీర్మానములు

1. 1924—1925 సంవత్సరములలో యేర్పాటుకాబడిన సివిల్ జస్టిసు కమిటీవారి సూచనలను (రిపోర్టుబుక్కు 166 పేజీ 18-వ పేర) గవర్నమెంటు హైకోర్టువారు త్వరలో అమలులో నుంచవలసినదనిన్నీ, ప్రాసెస్సు సర్వర్లు అమీనాలు మద్రాసు హైకోర్టు జడ్జీలవలెనే పరిగణింపబడవలసినదనిన్నీ ప్రాసెస్సు సర్వర్లను సుపీరియర్ సర్వీసులో చేర్చి వైలిఫ్ అని పేరు నిచ్చి అందుకు అనుబంధముగ నుండు సేకమడన్ల వస్త్రాలకు యేర్పాటులు చేయవలసినదనిన్నీ, యీ సభవారు హైకోర్టును గవర్నమెంటును ప్రార్థించుచున్నారు.

2. జిల్లాలలో పనిచేయుచున్నటువంటి ప్రాసెస్సు సర్వర్ల జీతమును దిగువ వివరముచేయబడిన రీతిగా నుంచవలయుననిన్నీ, ఫస్టుగ్రేడు వైలీపులను సెకండుగ్రేడు వుద్యోగస్థులనుండి ప్రమోషను మీదనే యేర్పాటు చేయవలసినదనిన్నీ, 1-వ గ్రేడు వైలిఫులకు డైరక్టు రిక్రూటుమెంటు వుండకూడదనిన్నీ యీ సభవారు హైకోర్టువారిని గవర్నమెంటువారిని కోరుచున్నారు.

వైలిఫు 1 వ గ్రేడు రూ 40-2-60

డిటో 2 వ గ్రేడు రూ 20-1½-35

3. రివిన్యూ డిపార్టుమెంటులోవున్న ప్రాసెస్సు సర్వర్లు జెంపరరీగా ఉద్యోగములలో వున్నప్పటికి సివిల్ కోర్టు ప్రాసెస్సు సర్వర్లు చేయుచున్న పని ప్రమాణములలో 1/10 వంతు లేకపోయినప్పటికిని, ట్రావెలింగు ఎలవన్సుతు రివిన్యూ ప్రాసెస్సు సర్వర్లకు యిచ్చుచున్నందున్ను, సివిల్ కోర్టు ప్రాసెస్సు సర్వర్లకు కూడ ట్రావెలింగు ఎలవన్సు జేబు యిప్పించవలసినదనిన్ని లేనియెడల నెల 1 కి రూ 5-0-0 లు గొప్పున డ్యూటీ యలవన్సు యిప్పించవలసినదనిన్ని యీ సభవారు హైకోర్టువారిని లోకల్ గవర్నమెంటువారిని కోరుచున్నారు.

4. పోలీసు కానిస్టేబిల్సు సివిల్ కోర్టు ప్రాసెస్సు సర్వర్లు ఒకటే ఉద్యోగపద్ధతిలో ఉండుటచేతనున్ను, కానిస్టేబిల్సుకంటె యెక్కువపని ప్రాసెస్సు సర్వర్లు చేయుటవల్లనున్ను నివాసమునకుగాను వసతులు ఉచితముగా యేర్పాట్లు చేయవలసినదనిన్ని అట్టిది లేని యెడల నెల 1 కి రూ 5-0-0 లు అద్దె అలవన్సు యిప్పించవలసినదనిన్ని యీ సభవారు హైకోర్టువారిని లోకల్ గవర్నమెంటువారిని ప్రార్థించుచున్నారు.

5. పోలీసు కానిస్టేబిల్సు పోస్టుమెన్లవలెనే ప్రాసెస్సు సర్వర్లకు కూడా యూనిఫారం యిప్పించవలసినదనిన్ని బిళ్ళ బెల్టు డవాలీ తీయించి వాటిస్థానే వైలిఫు అను పేరు చెక్కబడిన బిళ్ళను యిప్పించవలసినదనిన్ని యీ సభవారు హైకోర్టువారిని గవర్నమెంటువారిని కోరుచున్నారు

6. సెలవు ప్రావిడెంటు ఫండు మొదలగు ఇతర సౌకర్యముల విషయమై ప్రాసెస్సు సర్వర్లకు కూడా ఫండమెంటల్ రూల్సు వర్తించునట్లుగా యేర్పాటుగావింపవలసినదని యీసభవారు హైకోర్టువారిని గవర్నమెంటువారిని ప్రార్థించుచున్నారు.

7. పైని వసూలుచేయబడిన సూచనలను అమలులో నుంచినను ఆర్థికస్థితి యెక్కువ అగునేయెడల ప్రాసెస్సు ఫీజు హెచ్చుగా వసూలు చేయవలసినదనిన్ని హైకోర్టువారిని లోకలు గవర్నమెంటువారిని యీ సభవారు ప్రార్థించుచున్నారు

8 సివిల్ జస్టిస్ కమిటీవారు వారి రిపోర్టులో తెలియజేసిన ప్రకారం ప్రాసెస్సు సర్వర్లకు న్యాయమైన అనిగాని వైలిఫుల మాన్యూయలు గాని తెలుగుభాషలో తయారుచేయించి ప్రతి ప్రాసెస్సు సర్వరుకు ఒక్కొక్క ప్రతి యిప్పించవలసినదిగా యీసభవారు హైకోర్టును గవర్నమెంటువారిని ప్రార్థించుచున్నారు.

9 మిలిటరీలో పనిచేయుచున్నవారి పిల్లలకు ఉచితముగా విద్యాభ్యాసమునకై యేర్పాటు చేసినరీతిగా ప్రాసెస్సు సర్వర్ల పిల్లలకుకూడ ఉచితముగా విద్య నభ్యసించుటకు తగు యేర్పాట్లు చేయింపగలరని హైకోర్టువారిని గవర్నమెంటువారిని యీ సభవారు కోరుచున్నారు

తీర్మానము లయినపిమ్మట శ్రీయుత కాళేశ్వరరావు పంతులుగారు శాసనసభయందు అవకాశము దొరికినప్పుడు ప్రాసెసుసర్వర్ల క్షేమాభివృద్ధికై కృషిసల్పుదుమని తెలిపిచ్చిరి.

సభను ముగించుచు, అధ్యక్షులవా రిట్లు నుడివిరి:—కాన్ఫరెన్సులో ఆమోదింపబడిన తీర్మానములు చాల చిక్కుగనున్నవి అందరు ఒకత్రాటను నడువవలెను. ఒక్కరిమాటమీద నుండవలయును. ఈ రాజధానిలోని ప్రాసెసుసర్వర్లు అందరు యేకగ్రీవముగ ఆందోళన జరుపుదురేని ప్రభుత్వము చెవియొగ్గి పెట్టవలెను. ఎట్టి నిబ్బరపురుండైన గల ప్రభుత్వ మయినను యిందరికోర్కెలను నిరాకరించుటకు శక్యముకాదని నమ్ముదును. ప్రాసెసుసర్వర్లలో ప్రచార మెక్కుడుగ జరుగవలెను. ఒకేత్రాటనడుచుట అలవాటు కావలయును. ఈ కాన్ఫరెన్సువలన అట్టి ఐకమత్యమును, ఏకోభావము చేకూరునని నా నమ్మకము."

పిమ్మట ప్రతినిధులకు, ఇతరప్రముఖులకు అల్పాహారవిందు జరిగెను. ఫోటోగ్రాఫు తీయబడెను. వందనసమర్పణముతో కాన్ఫరెన్సు ముగిసెను.







# సర్వపక్ష సమావేశ రిపోర్టు

స్వరాజ్యపార్టి తెలుగుపుస్తకములు బెజవాడ ఖద్దరు స్టోర్సులోను, బందరు కాంగ్రెసు ఆఫీసులోను విక్రయమునకు సిద్ధముగా నున్నవి. కావలసినవారు ఆయాస్థలములలో తీసుకొనవచ్చును.

వెల రు 1/-ఒకరూపాయి మాత్రం

# అభినందనపత్రిక

శ్రీ దేవరకోట పరగణా, కృష్ణాపురం, పెదతేగి పురవరాధీశ్వర శ్రీ వీర్లగడ్డాన్వయ వార్ధి రాకాసుధాకర శ్రీమంతు రాజా శివరామ ప్రసాద బహద్దర్ జమీందారుగారి పట్టాభిషేక మహోత్సవ సమయమున సమర్పించినది.

రాజచంద్రా!

నీ రాజ్యాభిషేకమున దేవరకోట ప్రజాహృదయ చకోరములు ఆనందవివశములై నీవనెడు వెన్నెలల దనివి దీఱఁ ద్రావ మాడినవి. నీరాజ్యరమా పాణిగ్రహణ మహోత్సవమున మామనమ్ములు పల్లవించినవి. నీరాజ్యచక్ర నిర్వహణదీక్షా పరిగ్రహణమున మాయెడందలు పెలుపొందినవి. నీపట్టాభిషేక విభవమ్మున మామనస్సులు ఆనందవిభ్రమముల కాటపట్టులైనవి.

అంకితసీడ్ రాజన్యా!

సత్యవాక్పరిపాలనమున హరిశ్చంద్రుండ వౌదువు గాక. ధర్మపరిపాలనమున ధర్మజుని మించుదువు గాక. ఆశ్రితావనమున నీ వపరవిష్ణుండ వౌదువుగాక! శత్రువిదళనమున శర్వునితోఁ దులఁ దూఁగుదువుగాక! కళోపాసనమ్మున శ్రీకృష్ణదేవరాయలఁ బోలుదువు గాక! ఆంధ్రమర్యాదా స్థాపకత్వమున కాకతీయంపియుల ననుకరింతువుగాక!

భూవరా! కళాభిమానుల మిన్నవై, భాషాపోషకుల మన్నకుఁడవై, శివారాధకుల చేర్పుకల్గవై, మన్నీలకెల్ల వౌర వై, శూరుల తలమానికంబవై చిరకాలము సిరిసంపదల నోలలాడుదువుగాక! వంశగతమ్ములగు ప్రతిష్ఠా పాండిత్యమ్ములు ప్రవర్ధమానములుకా, నీవు, వంశవర్ధనుఁడ వౌదువు గాక!

చల్లపల్లిదొరా! ప్రజారంజకత్వము పునాదిగా, చల్లని నీయేలుబడి యెల్లవారల వినుతింప, నీకీర్తిసౌధము, తెలుగునాట నేనాట నిలిచి యుండుగాత!

తెలుగుఱేడా! తెలుగు బాసకు బట్టుఁగొమ్మవై, తెలుగువారికి కలిమివై, తెలుగు చదువులకూఁతవై, తెలుఁగు నాటికి విద్యాభిక్ష ప్రసాదింతువుగాక!

ఆంధ్రత్వము విడనాడక, జాతీయత వాలనీక, సమత్వము సన్నగిలనీక, అంతర్జాతీయతకనువగు పద్ధతుల, నారయుచు నీప్రజలకు నీవు మార్గదర్శకుఁడ వౌదువుగాక! సకల సంపదలతోఁ దులఁదూఁగుమ్ము, చిరకాల మో శివరామరాజా! దయాతరంగితుఁడవై మమ్మేలుదువు గాత!

ప్రభూ! నీపట్టాభిషేకోత్సవమున నీకై మాచేయు నంజలి యిదికో.

నీయేలుఁబడి రమా లీలాలక స్వకీయ
చంచలత్వము విరమించుఁ గాత!
నీపాలనమ్మున నీరవాసము రాణి
సత్కళల్ ప్రజలలో సాఁగుఁగాత!
నీరాజ్యమున ధర్మనిరతియు, భక్తియు
వాఁడు వాఁటికి ముందు నడచుఁగాత!
నీకోసఁ గిరులకు నెలకొమ్ము, పండిత
నిలయమై నిత్యమ్ము వెలుఁగుఁగాత!
కళలు వర్ధిల్లుఁ గాత! నీకారణమున
విద్య వ్యాపించుఁగాత! నీపేరుతోడ
రామరాజ్యము మెఱపించు రాజవనఁగ
బడయుదువు గాత! కీర్తి శివప్రసాద!
నీ ప్రయత్నాల విజయమ్ము వెలుఁగుఁగాక!
నీదు రాజ్యాన సౌఖ్యమ్ము నిలుచుఁ గాక!
నీవు గ్రంథాలయముల మన్నింతుఁ గాక!
నీవు వంశాన వెలుఁగొంది నిలుతుఁ గాక!
అదు గడుగుడ త్రైశ్వర్యము
వాడుకల మన్మలను ఎత్తు కూరిమి మురువుం
బడయుదువు గాక! చవులూర
బొరిఁగడి నీ విమలకీర్తి తుహినాంశురుచుల్.

<table>
<tr><td>మాశేర.<br>23-12-29</td><td>శ్రీ బాలసరస్వతీ<br>పుస్తకభాండాగారసభ్యులు</td></tr>
</table>

# ఆంధ్రదినపత్రిక

| ఆంధ్ర దినపత్రిక | పారుగూరివారికి | | | చెన్నపట్నమువారికి | | |
|---|---|---|---|---|---|---|
| సంవత్సరమునకు | 24 | 0 | 0 | 20 | 0 | 0 |
| ఆరుమాసములకు | 12 | 0 | 0 | 10 | 0 | 0 |
| మూడుమాసములకు | 6 | 4 | 0 | 5 | 4 | 0 |
| నెలకు | 2 | 2 | 0 | 1 | 13 | 0 |

# వారపత్రిక

వారపత్రికకు సంవత్సర చందా రూ. 4 0 0

వారపత్రిక సంవత్సరమునకు తక్కువ చందాలు కంపబడదు.

## గానసభ-ఒంగోలు

5-1-30 తేది సాయంకాలము 5-30 గంటల మొదలు 7-30 గంటలవరకు ఒంగోలులో శ్రీ సింహపాటి వెంకటరంగయ్యగారి హిందూ మిడిలుస్కూలుహాలులో సుప్రసిద్ధ ఆంధ్రగాయక శిఖామణులని పేరొందిన కీర్తిశేషులయిన బ్రహ్మశ్రీ, మ. రా. శ్రీ ధేనువకొండ చిన్నయ్యపంతులుగారి కొమారులు సుబ్బారావుగారు తమ అనమానగానకౌశలముచే పౌరుల నెల్లరను గానరససాంబుధి నోలలాడించిరి. నీతి, భక్తి, వైరాగ్య ప్రబోధజనితము లగు శ్రీత్యాగరాయ కృతులను వారి ముఖతః విని సభ్యులెల్లరు ఆనందపారవశ్యమున మైమఱచిరన్న నతిశయోక్తి గాదేమో. సుబ్బారావుగారు పిన్నవయస్కులయ్యు ప్రఖ్యాతము దాక్షిణాత్యసంగీతసామ్రాజ్యముగా భావింపబడుచున్న సంగీత విద్యలో ప్రావీణ్యమును సంపాదించి ఆంధ్రవ్యక్తిత్వమును ప్రకటింపజాలుట మన ఆంధ్రులకెల్లరకును యశోదాయకమైనదై యున్నది. మృదువైన కంఠధ్వని, గంభీరవాక్కు, చక్కని సాహిత్యము, అన్నిటికిని వన్నెతెచ్చు గానకౌశల్యము, సాధన సంపత్తి, శ్రీ సుబ్బారావుగారికి సాంప్రదాయార్థములై యున్నవి. ఇట్టి పిన్నవయస్కులగు గాయకులకు, ఆంధ్రసోదరులు తగిన ప్రోత్సాహ మొసఁగుట శ్రేయోదాయకము.

మార్దంగికులు బ్రహ్మశ్రీ వేమూరి రామమూర్తిగారు ఫిడేలు వాయించినట్టి బ్రహ్మశ్రీ గోదావర్తుల ఆంజనేయులుగారును సుబ్బారావుగారి గానమున కత్యంతమగువన్నెను వారి పాండితసామర్థ్యములచే కలుగజేసిరి.

ఇట్టి అవకాశమును పౌరులకు కల్పించినట్టి మ. రా. శ్రీ శ్రోవకుంట జానకిరామయ్య పంతులు బి. ఏ. జిల్లాకోర్టు ప్లీడరుగారి కెల్లరు కృతజ్ఞులు.

పావులూరి వెంకటసుబ్బారావు.

* * * * *

శ్రీ దేవరకోట పరగణా, కృష్ణాపురం పెదతేగి పురవరాధీశ్వర శ్రీ వీర్లగడ్డాన్వయవార్ధి రాకాసుధాకర శ్రీమంతు రాజా శివరామప్రసాద బహద్దర్ జమీందారుగారికి శ్రీ వేంకట దుర్గమాంబా సతిమణి పాణిగ్రహణ మహోత్సవ సమయమున సమర్పించిన

### పద్యోపహారము

శ్రీ సంపూర్ణ! కామితములు
కాంక్షలూన! సర్వ గాగ్య కలితుఁడవు— ఏలా
దీవింపుము నిక్ శివా!
మానినివ ! తృప్తి కూడ విందుము శుభముల్ !
శైవబ్రాహ్మణభక్తిఁ దాతలు మహాసామ్రాజ్యసంపాదన
శ్రీవాసించిరి; అస్మదీయ మహితాశీర్వాద సంధానిత
శ్రీ వైదుష్య విలాసభాసుర భవత్ప్రేమావధూటీమణిన్
నీవుర్ బొందితి యశమ్ము వెంప సమరన్ రాజ్యమొప్పారఁగన్
శివరామప్రభు నామ నేఁ డారి వార శ్రీసుంద్రమై యొప్పి భా
గ్యవతిన్ వేంకటదుర్గమాంబికను విత్యశ్రీలు నేకూర్పఁగన్—
భవిధియమ్ములు శాంతిసద్గుణము, విశ్వస్పష్టపాతమ్ము, శాం
భవిన్ మోదము గూర్చి రాజ్యమున కానందంబు సంధించుచున్
నీకల్యాణము ప్రాత విన్నియల రంజింపించె; వెన్నెల్లలో
రాకన్ జంద్రుని బోలె నిన్ను గని 'వర్ధాగా' యభాసిల్లె; నీ
యీశై సేతవు చొక్కిపోయినది మాబృందమ్ము విద్యానిధీ !
నీ కద్దోయి మహాను రాగముల జెందింపించు శౌర్యమ్ముల్.
"దేవరకోట" కై బహుళకీర్తి పండితు లెవ్వరేనియున్
దేవర కోటలో ఘనసుదీర్ఘవమ్మును చూపకుండ నీ
పోవును గాక, అవని తపోవిధివారుధవమ్ము నీయుగా
జీవన లంది సౌఖ్యమును తేజము నందుదు గాక భూవరా !

<table>
<tr><td>మాశేరు,<br>11-12-29.</td><td>శ్రీ బాలసరస్వతీ పుస్తకభాండాగార<br>సభ్యులు.</td></tr>
</table>





## మదరాసు షెరీఫ్‌గారికి, మదరాసు వర్తకు లిచ్చిన సన్మానపత్రము

### మదరాసు షెరీఫ్ జనాబ్ సి. అబ్దుల్ హకీమ్ సాహేబు బహదర్ వారి సన్ముఖమునకు

అయ్యా,

తమ కీమధ్య మదరాసు షెరీఫ్‌పదవి లభించినందుకు వర్తకులమైన మేము హృదయపూర్వకముగ మిమ్ముల నభినందించుచున్నాము. ఈ ప్రదేశములలో తాము ప్రముఖులు గావున తామె పౌరుల ప్రతినిధిగ భావింపబడుటయేగాక యీ మదరాసు నగరవాసులకు నిరుపమాన సేవచేసి గొప్ప కీర్తినిపడయు గొప్ప భాగ్యము మీకు నేడు లభించినది. ఈగొప్పపదవిని మన రాష్ట్ర గవర్నరుగారు తము కిచ్చుటలో దక్షిణఇండియా ప్రజలు మిమ్ముల గౌరవింప కుతూహలములో మందున్నారని గ్రహించి యందుకు తగినట్లే వారు వర్తించిరి. ఈసందర్భమున తాము గావించిన మహోపకారములను ప్రజాసేవను ప్రపంచమునకు వెల్లడిచేయుటకు చక్కని యవకాశము దొరకినదనియే తలచుచున్నాము. మహమ్మదీయసంఘ క్షేమమే గాక మన దేశ పురోభివృద్ధికిని కూడ పూర్తిగా కమునించి అను యుదారహృదయము వ్యక్తపరచియున్నారు. దక్షిణఇండియాలోని వాణిజ్యం బాడి ఇస్లామియా కాలేజిని వేలూరులోని మదరాసియా ఒల్లియెన్ సంస్థలను ఉత్తరహిందూస్థానములోని అలిఘర్ ముస్లిం యూనివర్సిటీకిని ఢిల్లీ నేషనల్ ముస్లిం యూనివర్సిటీకిని తా మపారసహాయము గావించియున్నారు. మదరాసులోని ముస్లిం హైస్కూలునకును, విహారములోని ముస్లిం హైస్కూలునకును తాము అన్నివిధములుగ సహాయము పూర్తిగ గావించి తామే దీని నిర్మించియున్నారు. తమ సహాయములేనిది ఈసంస్థ లేర్పడుట కవకాశమే యుండియుండదు.

తాము మదరాసు వర్తకులలో అగ్రస్థానము వహించి యున్నారు. కావున తమ వ్యాపారనిపుణతను గూర్చి చెప్పుట అవసరము.

తాము దక్షిణఇండియా చేంబర్ ఆఫ్‌కామర్సునకు చాలాకాలము వైస్‌ప్రెసిడెంటుగాను కొంతకాలము ప్రెసిడెంటుగాను నుండియున్నారు. తాము బ్యాంకిడైరక్టరుగను తోళ్ల వర్తకసంఘమున కధ్యక్షులుగను ఈ రాష్ట్రవర్తకాభివృద్ధికి చాలాసహాయము గావించియున్నారు. తాము పెరియమేట్టున నిర్మించిన దివ్యమైన మసీదు తమ కీర్తిని యీ రాష్ట్రమున చిరస్థాయి గావించెనని చెప్పుటవసరమని భావించెదము. మరియు ఘోషాసుందరి గోషాస్పత్రులు, మేల్‌విషారములోని లేడీగోషన్ ఆసుపత్రి వీనిని తామే నిర్మించిరి.

మితిరకాదుము స్మరింపబోవు ఈ రోజున తమగుణగణములగూర్చి గాని తమ నిరాడంబర వర్తనమునుగూర్చి గాని ప్రశంసింపజాలినదేను. తాము చేసిన్న యోవ్యవహారములలో కనబరచిన అపమాన శక్తిని మేమెన్నడును మరువజాలము. తమ మహమ్మదీయసంఘమునకేగాక దేశమునకును తాము గావించిన గొప్పధర్మముల యితరు లాదర్శముగ నుంచుకొందురనియే తలచెదము.

ఈ నగరవాసులలో అగ్రగణ్యులగు మీకు షెరీఫ్ పదవి లభించినందుకు మా హృదయపూర్వకమగు యభినందనముల నర్పించుచు తమకు వైభవము దీర్ఘాయురారోగ్యముల ప్రసాదించుగాకయని మామనస్ఫూర్తిగ కోరికల వెల్లడించుచున్నారము.

ఇట్లు, తమ విధేయులు,

మదరాసునందలి వర్తకులు.

# వృత్తాంతలేఖలు

## కడప

(ఒకవి లేఖరి)

### క్రొత్తసంవత్సరపు విందు

కడప, జన 6 :— కడపజిల్లాకలెక్టరువారు నిన్నటి సాయంకాలము కడపమండల పెద్దమనుష్యుల కెల్లరకు క్రొత్త సంవత్సరపు విందుగావించిరి సుమారు తొమ్మన్నూరుమంది విందుకు విచ్చేసిరి

### పాటకచ్చేరి

అనంతపురం ఎ. కే. ఎం. ఎస్. నారాయణరావుగారి కుమారుడు శ్రీనివాసమూర్తిరావు అను పదునొకండేండ్ల కుర్రవాడు నిన్న సాయంకాలము కడప రామకృష్ణసమాజమందు వారి గానసామర్థ్యమును జెల్లడిపరచిరి. పలువురు పండితులు గూడి ఆనందించి వానిని శ్లాఘించిరి.

### డిస్ట్రిక్టు కాంగ్రెసు కమిటి

మదరాసు లెజిస్లేటివు కౌన్సిల్ మెంబరగు మ. రా. శ్రీ ఆర్కాటు పరశురామరావుగారు పంపుకొన్న సంజాయిషీని చర్చించుటకు కడపమండల కాంగ్రెసు కమిటీ మీటింగు జనవరి 19 వ తేదీని కడప పట్టణము 7 వ నంబరు మదరాసు రోడ్డు భవనమందు జరుగనున్నదని మండలకాంగ్రెసు సెక్రటరీగారు తెలుపుచున్నారు.

రాజశ్రీ సి. దొరసామి అయ్యంగారు సంపిన రాజీనామా పైనిక రాబోవు అస్సెంబ్లీ బై-యెలెక్షనులో జమ్మలమడుగు టి. నరసారెడ్డిగారు ఆసనమునకు నిలువనలచుకొన్నారని తెలియుచున్నది.

నిన్నటిదినము బల్లు దూలటనలన ఒక మదుసలి కూలీయామె చనిపోయినది యింకొక అనకాలి మంచిగాయములు లోలి ఆసుపత్రిలో కష్టస్థితిలో నన్నది యింకొక బాలుడును గాయములు గిలి ఆసుపత్రిలో నుంచబడియున్నాడు సదిన నైకప్పు ఇంకను త్రవ్వ యత్తలేదు

## కైకలూరు తాలూకా వార్తలు

(స్వకీయవిలేఖరి)

### ఈదేపల్లి గ్రామపంచాయతీ ఎన్నికల తగాయిదా

ఈ పంచాయతీ మెంబర్ల ఎన్నికలు 18-5-29 తేదీని జరిగెను. ఆ ఎన్నికలు క్రమముగా జరుగలేదనియు వానిని రద్దు చేయించవలెననియు గ్రామస్థులలో కొందరు 8-8-29, 10-8-29, 21-8-29 తేదీలను శ్రీ కృష్ణా జిల్లా కలెక్టరు వారికి అర్జీలు ఇచ్చుకొనిరి. 15-9-25 తేదిగల 3323 లోకల్ అండు మునిసిపల్ నంబరు గవర్నమెంటు ఉత్తరవులోని 6 (సి) రూలు ననుసరించి 18-5-29 తేది ఎన్నికలు త్రోసివేసి నూతనముగా మెంబర్ల ఎలెక్షను జరపుటకు శ్రీ కలెక్టరు వారు ఉత్తరవు జారీ చేసినారు ఈ ఉత్తరవు ననుసరించి ఈ తాలూకా పంచాయతీల గౌరవసర్కిలు మ. రా. శ్రీ గుడిపాటి వెంకటాచలపతి పంతులుగారు ఈదేపల్లి గ్రామ పంచాయతీ మెంబర్ల యొక్క నూతన ఎన్నికలు ఈదేపల్లి గ్రామమునకు సుమారు రెండున్నర మైళ్ళ దూరములోనున్న పెదగొన్నూరు గ్రామములోని బోర్డు ఎలిమెంటరీ స్కూలులో 11-1-29 తేది పగలు 12 గంటలకు జరుపబడునని నోటీసులు జారి చేయించినారు. పైని ఉదాహరించిన గవర్నమెంటు ఉత్తరవుయొక్క 2 (III), 5 విధుల ననుసరించి ఎన్నిక ఆక్షేపణ అర్జీలు ఎన్నికఫలితము ప్రకటింపబడిన తేదినుండి 15 రోజులలో గాని చివరకు రెండునెలలలో గాని పంపుకొని యుండనందున శ్రీ కలెక్టరువారు చేసిన ఉత్తరువు న్యాయవిరుద్ధముగా నున్నది. పిరియు త్తరువు ఈలాగుండగా ఈదేపల్లి గ్రామ పంచాయతీ మెంబర్ల ఎన్నిక ఈదేపల్లి గ్రామములోనే జరుపబడవలసి యున్నను అక్కడనే జరుపుటకు ఏర్పాటు చేయక ప్రక్కన రెండున్నరమైళ్ళ దూరములోనున్న పెదగొన్నూరు గ్రామములో జరుపుటకు ఏర్పాటుచేయుట అంతకంటె న్యాయవిరుద్ధము. ఈదేపల్లి గ్రామములోనే ఎన్నికలు జరిగేయెడల ఎన్నికకాలమందు దొమ్మీ వగైరాలు జరుగునని నూచనలు కనిపించినయెడల అంతకష్టంగల గ్రామములో పంచాయతీ ఉండినప్రయోజనమేమి? దానిని శీఘ్రముగా రద్దుచేయించుటే గ్రామక్షేమమునకు లాభకరము. కాబట్టి పై విషయములను శ్రీ కృష్ణాజిల్లా కలెక్టరువారు పునర్విచారణచేసి న్యాయమైన ఉత్తరువులను జారీచేయుదురుగాక యని కోరుచున్నాము.



## విజయనగరము

(స్వకీయవిలేఖరి)

### విజయనగర వ్యాయామసంఘము

విజయనగరము, జనవరి 6.—5-30 సాయంకాలము విజయనగర పురజనులు విక్టోరియా జూబిలీపార్కునందు శ్రీయుత గుండాల రామావతారంపంతులుగారి అధ్యక్షతక్రింద సమావేశమయి "విజయనగర వ్యాయామసంఘము" అనుదానిని యొకటి స్థాపించిరి దాని ముఖ్యోద్దేశములు పట్టణములో నాల్గువైపులను వ్యాయామసంఘములు స్థాపించుట, ఏటేట పురుషులు, స్త్రీలు, విద్యార్థులు మున్నగువారిలో పోటీపరీక్షలు పెట్టి బహుమతు లిచ్చుట, మొదలగునవి. కార్యనిర్వాహకసభ్యుల చందా మూడురూపాయిలు. పోషకులు సం॥ నకు 12 రూ॥ సాధారణ సభ్యులు సం॥ నకు 8, 1 రూ॥ ఇవ్వవలెను.

ఈ సంఘమునకు 1930 సం॥ నకు శ్రీయుతులు గుండాల రామావతారం, ఓరుగంటి సీతారామస్వామి, నూరంపల్లి రెడ్డిగారి విజయరామయ్యగార్లు వరుసగా అధ్యక్ష, కార్యదర్శి, కోశాధికార్లుగా ఎన్నుకొనబడిరి. ఇంకను శ్రీయుతులు ఐరమాళ్ల సీతారామశర్మ, కేవి వెంకటరమణారావు, చొక్కాపల్లి చంద్రయ్యనాయుడు, బొడ్డు సత్యసత్యనారాయణ, టి. శ్రీనివాసరావునాయుడు, మాల్యాయి గోపాలదాసుగారలు కార్యనిర్వాహకసభ్యులుగా ఎన్నుకొనబడిరి.

### పంచాయితికోర్టు ఎన్నిక

పంచాయితీ కోర్టులో దాచేపల్ల రంగస్వామిగారు, బొడ్డు సీతారామస్వామిగారలయొక్క స్థానములు ఖాళీవచ్చినవి. అందులో నొకస్థానమునకు 4-1-30 తే॥ న యెన్నిక జరిగెను. శ్రీయుత నారాయణం వెంకటనరసింహజీగారు పోటీలేకయే యెన్నుకొనబడిరి. వోటర్లలో చాలమంది మిల్లుకూలీలే.

### ఖద్దరుప్రచారము

శ్రీయుత ఓరుగంటి సీతారామస్వామి పంతులుగారు 10 రోజులనుండి ఖద్దరుప్రచారము విరివిగ చేయుచున్నారు. వారు ఇంటింటికి వెళ్లి ఖద్దరు ధరించునని స్త్రీపురుషులకు బోధచేసి పలువురను స్వార్గమునకు దీసికొనివచ్చుచున్నారు. వారివంటి దేశోపకారులు వార్దునకు సర్కారైన వున్నచో, కొద్దికాలములోనే మాపురము ఖద్దరుచే నలంకృతము కాగలదు. పీరి ప్రోత్సాహముచే సంతపేటలో ఖద్దరు నిలయ మొకటి స్థాపింపబడునని తెలియుచున్నది.

